# కథాంజలి

## ఎట్జురఘుండా

విష్ణు

సీమియన్ ఇవానవ్ రైల్వేగేటుకీపరు. బండివచ్చేటప్పుడు గేటులో హాజరుగా వుండి గేటుమూయటం ఆగేటువద్దులోవున్న పట్టాల్ని సరిచూచుట, అతనిపని. ఆగేటు అడవి మధ్య వుంది. ఎనిమిది మైళ్లదూరంలో ఒక స్టేషను, అరమైళ్లదూరంలో ఒకస్టేషను దానికిరుప్రక్కలా వున్నాయి. అచ్చటకు మూడు మైళ్లదూరంలో ఒక బట్టలమిల్లువున్నది. అది కట్టి సంవత్సరందాటింది. ఆ మిల్లుగొట్టం వల్లగాను, పొడుగ్గాను అడవివెనుకనుండి కనబడుతూ వుంటుంది. అసమీపాన్ని పూర్వపు లేవు, కాని ఊళ్లపేరులతో కట్టిన రైల్వేగేటులుమాత్రం కొంచెందూరదూరంగా వున్నాయి.

సీమియన్ ఇవానవ్ శరీరం పూర్తిగా చెడిపోయింది. ఇప్పటికి తొమ్మిదేళ్ల కితం మరచి దృఢంగా వుండేవాడు. అప్పుడు అతనొహ మిలట్రీ ఆఫీసులో నౌకరు. రష్యా టర్కీల మధ్య జరిగినయుద్ధాన్ని కండ్లారా చూచాడు. ఎండను, వానను, చలికి, రాటుదేరి వుంది అతని శరీరం. అన్నం, నీళ్లు లేకుండా ఇరవైనాలుగు మైళ్లు ఆయాసపడకుండా నడవటం అతనికి సామాన్యమైన అలవాటు. అనేకసార్లు తుపాకిదెబ్బల్లో చిక్కుకున్నాడు. తుపాకిగుండ్లు అతని చెవిప్రక్కనుంచి ఝుం ఝుం మంటూ ధ్వనిచేస్తూ పోయేవి కాని అదృష్టవశాత్తు ఒకగుండుకూడా అతనికి తగలలేదు.

సీమియనుల గుఱ్ఱపుదళం ముందుకువచ్చి నిలిచిపోయింది. వారందినములవరకూ యుద్ధం జరుగుతునేవుంది. ఉదయంనుంచి సాయంత్రమువరకూ ఫిరంగులు, తుపాకీలు, ధాంధాం మ్మని పేలుతూనే ఉన్నాయి. ఇల్లాంటి సమయంలో రోజుకు మూడుసార్లు సీమియను వంటయింటినుండి యుద్ధభూమికి తన ఆఫీసర్లకు టీ, అన్నము చేరేస్తూవుండేవాడు. గుండ్లు అతనిప్రక్కనుంచి రైయ్యిమంటూపోయి ప్రక్కనున్న రాతిబండలకు తగులుతుండేవి. ఆ దెబ్బలకు నిప్పులు చెదురుతుండేవి. అప్పుడప్పుడు భయపడుతుండేవాడు. సీమియను టీకలుకూడా తీసుండేవాడు. కాని తిరిగి తనపనిలో లీనమైపోతుండేవాడు. ఆఫీసర్లకెప్పుడూ వేడివేడి టీ. అందిస్తూవుండటంచేత వారి దయకుపాత్రుడయ్యాడు. సీమియను అందరికీ నోట్లో నాలుకయ్యాడు.

అతడు యుద్ధాంతంచి ఇంటికి తిరిగి వచ్చేసరికి ఈశ్వరునికృపవల్ల కాళ్లు, చేతులు చక్కగానే వున్నాయి. కానిఒక క్షయవ్యాధి మాత్రం అనుసరించింది అతన్ని. అతను ఇంటికివచ్చేసరికి తన ముసలితండ్రి, నాలుగుసంవత్సరాల ఏకపుత్రుడు కాలంచేశారు. అతనికి దుఃఖం ఎక్కువయ్యింది ఇక సీమియను అతనుభార్య ఇద్దరే మిగిలారు. క్షయవ్యాధి భరింపరానిది. ఇరువురూ కలిసి బహుకొద్దిగా సంపాదిమకొనేవారు.

ఒకసారి ఈఊరిలో జీవితంగడపడం దుర్లభమని తలచి దంపతులిద్దరూ నౌకరీకొరకుపోతూ బయలుదేరారు. కొన్నిదినాలకు వారికొక స్టేషనులో నౌకరీ కుదిరింది. కానిఅది స్థిరమైంది కాదు. దీనితరువాత అతనిభార్యకు ఏదోపనిజరిగింది. సీమియనుమాత్రం యేమీ తోచక పిచ్చివానిలా తిరగేవాడు ఒకసారి అతనిని ఇంజను డ్రైవరు తన ఇంజనులో కూర్చోబెట్టుకొని తీసుకపోతున్నాడు. కొంతదూరంవెళ్లేసరికి ఒకస్టేషనుమాస్టరు ముఖం కొంత పరిచయమున్నమనిషిగా కనుపించింది సీమియనుకి. సీమియను తదేకదృష్టితో మాస్టరును చూడసాగాడు. అమాస్టరుకూడా సీమియనును రెప్పవెయ్యకుండా చూడ మొదలెట్టాడు. అఖరుకు ఒకరునొకరు గుర్తుపట్టుకున్నారు. ఆ మాస్టరు ఇదివరకు సీమియనుల సైన్యములో ఆఫీసరుగా వున్నాడు. నీపేరు ఇవానవ్ కదూ? అన్నాడు, మాస్టరు.

సీమియను- జానుసార్,

మాస్టరు- ఇక్కడికెట్లా వచ్చావ్?

సీమియను తనకథంతా వినిపించాడు.

మాస్టరు- మంచిది ఇప్పుడెక్కడుంటున్నావు?

సీ- ఎక్కడని చెప్పనుసార్.

మా- తెలివితక్కువ మనిషీ! "ఎక్కడని చెప్పనుసార్" అంటే అర్థమేమిటి?

సీ- ఆయ్యా! నిజంచెప్తున్నాను. ఎక్కడకు పోవడానికి ఆధారంలేదు. ఏదైనా నౌకరీ దొరకుతుందేమోనని ఇల్లాతిరుగుతున్నానుసార్.

స్టేషనుమాస్టరు అతనివైపు తీక్షణంగాచూచి ఒక క్షణంఆలోచించి:— మంచిది నీవు ఈ స్టేషనులోనే వుండు. నీకు పెండ్లిఅయ్యిందిగా! నీస్త్రీ ఎక్కడుంది? అన్నాడు.

సీమియను ఆయ్యా! నాకు పెండ్లిఅయ్యింది. నాభార్యకు ఒకషావుకారువద్ద పనికుదిరింది సార్.

మాస్టరు- మంచిది. దానినికూడా వుత్తరం వ్రాసి రప్పించుకో, ఇక్కడొకగేటు ఖాళీగా వుంది. నేను పెద్దాఫీసరుతో చెప్పి అఖారీలో నిన్ను వేయిస్తాను.

సీ- ఆయ్యా తమదయ.

సీమియను అక్కడే దిగిపోయాడు. మాస్టరు ఇన్నీవాకిలీయిచ్చి [illegible]జీతం తెచ్చి, స్టేషనుప్లాట్ ఫారము వూడ్చుట అతడు చేసేపనులు.

ఒకపక్షం పూర్తిగాకముందేతనభార్యకూడా వచ్చింది. వీరిద్దర్నీ ఒకట్రాలీ (తోపుడుబండి) మీదగేటుకుచేర్పించాడు స్టేషను మాస్టరు. ఆగేటు కొత్తగాకట్టినందువల్ల వేడిమిక్కుటంగా వుంది. దగ్గరగా పెద్ద అడవివుంటచేత పాయ్యిలాకట్టెలకు అక్కడ చిక్కుపడ నక్కరలేదు. గేటువానుకొని ఓము నపటివాడు పెంచిన చిన్న కూరగాయలతోటకూడావుంది. రైలును రెండువేపులా దున్నుకోడాని కనువుగా వున్న —ఎకరం చదరపుకడుగుల భూమికూడా వున్నది. ఇదంతాచూస్తే సీమియనుకు సంతోషం కలిగింది. క్రమక్రమంగా కొంతపొలం దున్నుకోవచ్చు, ఒకపాడావునిగాని, ఒకగుఱ్ఱాన్నిగాని మేపుకోవచ్చునని ఆలోచించాడు.

రైల్వేఇలాకానుండి ఒకపచ్చజెండా, ఒక ఎఱ్ఱజెండా. బకెటు, బిగులు, సమ్మెట, గొడలి, పార, చీపురు మొదలైన అవసర సామానులన్నీ లభించాయి. వీటితోపాటు ఒకకొత్త వనాలిక (టైంటేబిలు) కూడా ఇచ్చారు. ఇక్కడకువచ్చిన మొదటిరోజుల్లో సీమియనుకు నిద్రపట్టేదికాదు. పడుకుని తను చేయువలసిన పనులను, బాగుగా జ్ఞాపకం వుండేటట్లుగా మననం చేసుకుంటూవాడు. బండిరాకకు రెండుగంటలకు ముందుగానే పట్టాలమైనా తనిఖీ చేసుకుని గేటుకెదురుగా బెంచీమీద కూర్చుని బండిచప్పుడు గమనిస్తూ కూర్చుండేవాడు. కొద్దిదినాలలోనే అతనికి తన టైంటేబులు కంఠస్థం అయిపోయింది.

అదికోతవికాలం. పనిఆట్టేలేదు. పట్టాలమీద మంచుతీసే పనికూడా తగ్గిపోయింది బండ్లుకూడా తక్కువగా వస్తుండేవి. సీమియను తనవద్దులోవున్న పట్టాలను రోజుకురెండుసార్లు చూచుకునేవాడు. బోల్టులు శుభ్రం చేసుకొనేవాడు. స్లీపర్లు, ఎక్కడైనా దిగిపోయినా, మేకులూ, నట్లులూ, వదులైన వాటిని సరిచేసుకునేవాడు అఖరుకు నీటికాల్వాయినికూడా బాగుచేసుకుని పిమ్మట తన తోటపనిలో లీనమవుతుండేవాడు. అతనికేపనిలో వున్న తోటల్లా ఒక్కటే- తనకేదైనా సొంతపనివుంటే ఇనస్పెక్టరువద్దనుంచి సెలవుపొందాలి- ఇందుచేత వారిదంపతులకు కొంత విసుగ్గా వుండేదిపని-

ఈవిధంగా రెండుమాసాలు గడిచాయి- సీమియను క్రమంగాతన ప్రక్కగేటుకీపర్లతో స్నేహం సంపాదించుకున్నాడు- వారిలో ఒకడు ముసలివాడవడంవల్ల వానిని పనినుంచి తొలిగించదలచారు రైల్వేవారు- ఈవిచారంతో ఆతను గేటువిడచి ఈవలకు వస్తుండేవాడుకాడు- తనపనంతా తనభార్యే చక్కచేసుకునేది- రెండవతరఫుగేటువాడు యువకుడు- సన్నగారివటులావుంటాడు- కాని మంచి బలవంతుడు- సీమియనుకి, ఇతనికీ ప్రథమ కలయిక వారిసరిహద్దులో అయ్యింది- సీమియను టోపీతీసి తమ్ముడూ! క్షేమమా? అన్నాడు

యువకుడు తిరస్కారభావంతో చూచి:— ఆ- అంతా క్షేమమే- నీవుకుశలమా! అని తిరిగి మాట్లాడక తనదారినపోయాడు-

కొన్నిరోజులకు వారిద్దరిభార్యలకు స్నేహం కలిసింది- సీమియనుభార్య తరచుగా తన పొరుగువానిఇంటికి వెడుతూవుండేది- కాని ఆ ఇంటామె యెక్కువగా మాట్లాడేది కాదు-

ఒకదినం సీమియను యువకుని యింటికివెళ్లి అగృహిణితో ఏమమ్మాయి! మీదర్త ఎవరితో నూ యెక్కువ మాట్లాడడనుకుంటాను- నేనెప్పుడుచూచినా చాలా మితభాషిగానే కనిపిస్తాడు-

అగృహిణికూడా మితభాషిగానే వుంది- అతనికిట్లా జవాబిచ్చింది:— ఏంమాట్లాడమంటావు? ప్రతిమనిషీ ఏదోపనిలో మునిగి వుంటాడు- నీవుకూడా నీపనిలో మగ్నులై వుండు దేవుడు నీకు మేలుచేస్తాడు-

క్రమక్రమంగా సీమియనుకి, తనపొరుగువాడైన లాసిలీకి స్నేహం యెక్కువయ్యింది. సీమియను పట్టామీద కూర్చుని హుక్కాపీలుస్తూ తన జీవిత విధానాన్ని విలట్రీ నౌకరీవాటికథా అంతా వాసిలీతో చెప్తుండేవాడు, వాసిలీ నిశ్శబ్దంగా కూర్చుని వినేవాడు.

సీమియను తరచూ ఇల్లాచెప్తుండేవాడు: తమ్ముడూ నేను చాలాకష్టాలు అనుభవించాను సుమా! భగవంతుడు నాకెప్పుడూ సుఖమివ్వలేదు. పోనీతే తనయిష్టం యెట్లో అట్లానేఅవుతుంది. ఇక నాజీవితంకూడా అఖరుగా వచ్చింది. తమ్ముడూ! సంగతి ఇంతేనంటావా?

లాసిలీ[illegible]తనహుక్కాబూడిదపట్టాలకు దులిపి లేచినుంచుని ఇల్లాఅన్నాడు.— ఈ జీవితంలో అదృష్టమెప్పుడూ, మనవెనుకరాదు. మనవెనక వచ్చేవారెప్పుడు ఒంటవులే. మనుష్యునికంటె నిర్దయగల జంతువు యీభూమిలో పుట్టలేదు సుమా! చూడు తోడేలు తోడేలును తినదు [illegible]

గలడు.

లేదు తమ్ముడూ! ఇల్లా అనకు. తోడేలు తోడేలును తింటుంది.

నాకు తెలియని విషయాన్ని గురించి చెబుతూన్నాను, నిజానికి మానవునికంటే నిర్దయగల జంతువులేదని, మానవుడు తన దుష్టత్వాన్ని, లోభత్వాన్ని విడిచిపెట్టినట్లైతే ఈ ప్రపంచంలో వుండడానికి అర్హుడౌతాడని అనుకుంటాను. ఎవడినన్నా చూడు. వాడునిన్ను చంపడానికే చూస్తుంటాడు. వీలైతే నిన్నుతినాలనికూడా కోరుతూవుంటాడు.

సీమియను క్షణ మాలోచించి తమ్ముడూ! నేను చెప్పలేను. నీవు చెప్పింది నిజమేకావచ్చు. దేవుని ఇచ్ఛకూడా ఇదే అనుకుంటాను బహుశా, అన్నాడు.

లాసిలీ కోపంతో:-బహుశా నీతో మాట్లాడడమే బుద్ధితక్కువ. నీకప్రియమైన వాటి నెప్పుడూ భగవంతుని నెత్తిపైన పెడుతూవుంటావు. చాలా మూర్ఖుడవలేవున్నావు. నిన్నుబట్టి నీవు మానవుడవుకావని, పశువువని తెలుస్తుంది. ఇక నీతో మాట్లాడకూడదు అన్నాడు.

ఇల్లాచెప్పి లాసిలీ తనమిత్రునికి నమస్కారంకూడా చెయ్యకుండా తన దారిన తాను పోయాడు.

సీమియను లేచి తమ్ముడూ! కోప్పడకు, వినునేనేమి అలాటిమాట లాడలేదుగా అని కేకవేసి చెప్తున్నాడు. లాసిలీ నిలబడకుండా పోయాడు.

సీమియను రెప్పవేయకుండా అతడు కనిపించేటంతవరకు అల్లానేచూస్తూ నిలబడ్డాడు. తరువాత తనగేటుకు చేరుకుని ఓసే! మనపొరుగువాడు చాలా దుష్టుడుసుమా! అతన్ని మనయిల్లో రెక్కపెట్టనివ్వకూడదు. అన్నాడు భార్యతో.

దెబ్బలాడే స్వభావం గలవాడుకాదు సీమియను, అందుచేత ఇద్దరికీ మరల కలయికఅయినప్పుడు ఆదేవిషయంమీద అరేరితిగా చర్చ ప్రారంభించాను.

లాసిలీ సమయానుకూలంగా ఇట్లా అన్నాడు:-ఓమిత్రుడా మానవుని నీచత్వముచేతనే నేడు మనమందరమూ ఈగుడిసెలలో చెట్టె అణగగొట్టబడుతున్నాము.

అయితే ఈ గుడిసెల్లో వుండుట చెడ్డంటావా! ఇందులో మనుష్యులు వుండలేరా!

ఎందుకుండలేరూ! వుండగలరు. నీవు ఇంక చెడ్డవాడవయ్యావు. ఏళ్లు చాలా గడిచాయి, ప్రపంచాన్ని చాలావరకు చూచావు. కాని జ్ఞానం బాగాగానేకు తెలిసి అట్లానేవుంది, ఈ గుడిసెల్లో మనుష్యుల జీవితాలు యెట్లా గడుస్తున్నాయో నేనెరుగుదును. ఇంతకూ మనం మానవ రక్షకుల చేతుల్లో చిక్కుకున్నాం. వీళ్లు మనరక్తాన్ని పెల్చుకు తాగుతున్నారు. కడకు ముసలివాళ్లమైనతరువాత మిల్లులోవున్నంచి ధాన్యపుపొట్టుదేనికి పందులకు పడేసినట్లుగా మనలను బైటకు గెంటేస్తున్నారు. అయితే నీకేమైనా జీతం తీసుకుంటున్నావా?

లాసిలీ! నాజీతం అట్టేలేదు. పన్నెండు రుబుల్సు మాత్రమే (ఇది రష్యా నాణెము)

నేను పదమూడున్నర రుబుల్సు తీసుకుంటున్నాను. నీజీతపుపట్టీ చూశావు? నీనిలావాళ్లనిబంధన ప్రకారం చూస్తే ౧౫ రుబుల్సు ముట్టాలె. అవునా? కాదా? పొయ్యిలోకి కట్టెలు, లైటులో నూనె అవసరం ఏం?అందులోనూ తగ్గిస్తారా? రెండుమూడు, రుబుల్సు మాటకొస్తు నేనెప్పుడు పోనీ పదిహేను రుబుల్సు పూర్తిగాదొరుకుతావనుకో. అప్పుడుమాత్రం?...... ఏం, అవుతుంది? నీవేచెప్పు? ఇంతతక్కువ జీతంతో ఎవరైనా జీవితం గడుపుకోగలరా? పోయిన నెలలో ఒకసారి స్టేషనువెళ్ళాను, అప్పుడే పెద్దాఫీసరు వస్తున్నాడు ఆయన్ని చూచేభాగ్యం నాకూ అబ్బింది అదినం. ఆయనకొరకు ప్రత్యేకంగా ఒక పెట్టెను వేయిస్తారు. ఆపెట్టె ఎట్లావుందని చెప్పను!... అబ్బ నేనుచెప్పలేను........ ఆయన రీవితో వచ్చి ప్లాటుఫారంమీదనుంచి నిలబడగానే ఫ్రిజలు గుంపులు గుంపులుగావచ్చి సలాములు చేసిపోయారు. అదృశ్యంచూచి తీరాలవిందే.

ఇంతకూ చెప్పవచ్చేదేమంటే నీవు నీస్థితిని కాస్త ఆలోచించుకో. నేనైతే ఇక్కడనేవుండను. ఎక్కడికేనా పోతాను. నాకాళ్లు ఎక్కడకు తీసుకుపోతే అక్కడకుపోతాను.

కాని లాసిలీ! ఎక్కడకుపోతావు? ఇలాటి తగాదాల్లో పడవద్దు. ఇక్కడ ఇల్లుంది సౌఖ్యం వుంది, దున్నుకోడానికి ఏదోకాస్త నేలకూడా వుంది. నీభార్యకూడా నీపనికి సహాయపడుతూ వుంటుంది ఇంకేమికావాలి నీకు?

భూమివుంది ఎందుకులేదు. కాని ఆభూమిని చూడ తెలుస్తుంది. దాంట్లో ఒక్క అకుకూడా బయలుదేరదు. పోయిన ఫసలీలో గోబిమొక్కలు వాటాను దాంట్లో, ఇనస్పెక్టరు ఫరీదుషవ [illegible]

(ఇంకా వున్నది)

# బొంబాయి శాసన సభలో అడ్జర్న్ మెంటు ప్రతిపాదనము

## నిజామాబాదు ఆంధ్ర మహాసభలో వంటి నాటకము

## ప్రభుత్వముపై ప్రతి కక్షుల తీవ్ర విమర్శలు

బొంబాయి మార్చి (టపా)

మధ్యాహ్నము బొంబాయి శాసనసభలో ప్రతికూల పక్షము వారొక అడ్జర్న్ మెంటు ప్రతిపాదనము చేయబడినపుడు, దానిపై ప్రతిపక్ష సభ్యుల ఉపన్యాసములు మహా పౌరుషావేశపూరితములై ప్రభుత్వపు హోం మెంబరగు మున్షీ గారికి ఊపిరాడనీయలేదు. మొత్తము ఆ అడ్జర్న్ మెంటుపై ప్రతికూలపక్ష నాయకులయొక్క ఉపన్యాసములను ప్రభుత్వపక్ష సభ్యుల సమాధానములను చూడగా, నిజామాబాదులో ఆంధ్రమహాసభలో అడ్జర్న్ మెంటు ప్రతిపాదన వలెనుండెను

ఈ అడ్జర్న్ మెంటును ప్రతిపాదించుచు జమ్నదాసు మెహతా గారు దాని కారణమైన కథ నిట్లు చెప్పిరి. జాధవజీ, ధిరాజ్ లాల్ అను ఇద్దరు ప్రత్తి వ్యాపారస్థులు, తమవ్యాపారమును జూదపు పద్ధతులపై నడిపించినందుకు, జూదపు పద్ధతులను నిషేధించు శాసనము ననుసరించి బొంబాయి ప్రధాన రాజధాని మేజిస్ట్రేటుచే చెరియొక వేయి రూపాయల జుర్మానాచే శిక్షింపబడిరి. అంతవారలు హైకోర్టుకు మురాఫా చేసికొనినపుడు, ప్రభుత్వమువారు దానిని ప్రతిఘటించుటయేగాక శిక్షను ఎక్కువజేయుటకు కోరిరి. హైకోర్టువారు ఆలోచించి, మేజస్ట్రేటు విధించిన శిక్షను స్థిరపరచుటయేగాక ఒక్కొక్కరికి ఆరు నెలల శిక్షనంతున ఎక్కువజేసిరి. అతర్వాత ఖైదీలు, తమ వ్యాపార విషయములను కొన్నిటిని పరిష్కరించుకొనగల్గుటకై కొన్ని రోజులు శిక్షను ఆపియుంచవలెనని కోరిరి. హైకోర్టువారు ఆకోరికను న్యాయరీత్యా ఆలోచించి, దానిని నిరాకరించిరి.

అంత ఖైదీలు ప్రభుత్వము వారి వద్దకుపోయిరనియు, హైకోర్టువారు శిక్షను ఆపుటకు నిరాకరించినను ప్రభుత్వమువారు ఖైదీల కోరికకను కూలపడిరనియు ఒకపత్రికలో ప్రకటించబడినదనిరి.

వార్తాపత్రికలో వార్త ఇదిఅని జమ్నదాస్ మెహతా గారనినపుడు హోం మెంబరు మున్షీ గారు కేవలము ఎవరో చెప్పినమాటపై ఆధారపడ వీలులేదని ఆక్షేపించిరి. మెహతా గారు తాను వార్తాపత్రికపైన మాత్రమే ఆధారపడుటలేదనియు, మంత్రిగారు చెప్పిన సమాధానము విన్నతరువాత తనదితప్పని తనకు సంతృప్తి గలిగినచో, తాను అడ్జర్న్ మెంటు ప్రతిపాదనను గూర్చిన చర్యను సాగించుటకై ఒత్తిడిచేయననియు చెప్పిరి.

కాబట్టిప్రభుత్వము వారివద్దకుపై జెప్పబడినవారు కొద్దికాలము శిక్షను ఆపియుంచవలెనని కోరు దరఖాస్తు పంపుకొనినదియు లేనిదియు, కొద్దికాలము శిక్షను ఆపియుంచవలెనని కోరు దరఖాస్తు హైకోర్టువారిచే నిరాకరించబడిన సంగతి ప్రభుత్వమువారికి తెలుపబడినదియు లేనిదియు, ప్రభుత్వము వారు ఆజ్ఞ నిచ్చుటకు పూర్వము కేసుకు సంబంధించిన రికార్డులను తెప్పించుకొనినదియు లేనిదియు తెల్పవలసినదిగ ప్రభుత్వము వారిని కోరుచున్నాను అని మెహతా గారడిగిరి.

మొదటనే అట్లు శిక్షను ఆపుటకు దరఖాస్తు ప్రభుత్వము వారివద్దకు పంపుకొనబడినచో, అప్పుడు ప్రభుత్వము వారి చర్యయందేమైన అర్థముండియుండును. కాని మొదటనే హైకోర్టుకు దరఖాస్తు పంపుకొని, అక్కడ దరఖాస్తు నిరాకరించబడిన తర్వాత ప్రభుత్వము వారివద్ద మరియొక దరఖాస్తు పెట్టుకొనబడినది.

ఇట్టిస్థితిలో ప్రభుత్వము వారు తమ వివేకము నుపయోగించి ప్రయోగించవలసిన అధికారమును ప్రయోగించుటయందు వారివిధి రెండింతల భారమైనది, మరియు నేరస్థులు చిన్నవారుకారు. వారు ఏ నేరమునకై శిక్షనొసగబడిరో అది నిజముగా విసుగు కలిగించునది—పట్టణమునకు చీడవంటిది దానిని అణచుటకు ప్రభుత్వమువారొక శాసనమును చేసియున్నారు. ప్రభుత్వము వారిపై రాష్ట్రములో భద్రతను, శాసనములను, క్రమవ్యవస్థను రక్షించు బాధ్యత యున్నది. వారు తమ ఇష్టములోనున్న అధికారముల నుపయోగించి నేరస్థులను తప్పించుకొని పోనీయరాదు. శాసనోల్లంఘన విషయములో ఖైదీ జబ్బుగానున్న తన బంధువును కనిపెట్టియుండుటకో లేక అంత్యక్రియల జరుపుటకో అతని శిక్షను తాత్కాలికముగ ఆపియుంచుట జరిగినది నిజమే కాని ఆఖైదీలు అవినీతికరమైన దేదియు చేసియుండలేదు.

శాసనోల్లంఘన సమయములో జరిగినదానిని ఆధారముగ తీసికొని జూదమాడువారి విషయమున ప్రవర్తించరాదు. ప్రభుత్వమువారు హైకోర్టువారు ఆలోచించి గావించిన నిర్ణయమునిట్లు అతిక్రమించుటకు నిశ్చయించుకొని, తమ విధిని లాంఛనమని వెల్లడించినపుడు వారలు నిందాపాత్రులగుచున్నారు. హైకోర్టును చిన్నపిల్లవానినిగజూచి, అట్టి ముఖ్య విషయములో దానిని అలక్ష్యము చేయుచో, అతిగౌరవముగల ఎవడును హైకోర్టులో న్యాయమూర్తి స్థానమును అంగీకరించుటకు రాజాలడు. ప్రస్తుతమున్నందు న్యాయమూర్తులు గూడ రాజీనామా నిచ్చెదమని బెదరించెదరు.

నేరస్థుడు పరిష్కరించుకొనవలసిన వ్యాపార వ్యవహారములేమైన యున్నచో, జైలులోనే వారలకు న్యాయవాదులతోను బంధువులతోను సంభాషించుటకు ఎక్కువ సౌకర్యముల నీయవలెను.

అక్తర్ మీర్జా గారు ప్రభుత్వచర్యచే న్యాయమూర్తులలోను, న్యాయవాదులలోను ఏర్పడియున్న భయమును సరిగా వర్ణించలేనని చెప్పిరి. ప్రభుత్వమువారు సెక్షను ౪౦౧ క్రింద అట్టిచర్య గైకొనుటకు అధికారము గలవారైనను, వారు ఆ అధికారమును సరిగా వినియోగించలేదనిరి.

ఆర్. ఆర్. భోలే గారు ప్రభుత్వమువారు విషయములను సభవారికి తెల్పుటకై ఒక వాఙ్మూలము నొసగవలయుననిరి.

ప్రభుత్వమువారు విషయములను వివరించిన తర్వాత దాని ఆధారముపై చర్చ జరుగుచో దానికి అంతేమియుండదనిరి.

అధ్యక్షులవారు సూచించుచు, అడ్జర్న్ మెంటు ప్రతిపాదనను సమర్థించుచున్నవారలు తమకు తెలిసినదే నిజమని నమ్ముచున్నారు గనుక, ప్రభుత్వమువారును తాము గైకొనినచర్యకు కారణములను చెప్పుట సమంజసముగ నుండును, కాని తాను ప్రభుత్వము వారిని నిర్బంధించుట లేదు అనిరి.

మెహతా గారు ప్రధానమంత్రియగు బి. జి. ఖేరుగారు ఉపన్యాసములమీద ఉపన్యాసములు చేయుటకు ఇదిసామాన్యవిషయము గాదనిరి.

ప్రభుత్వము వారు ఇంతవరకును సాధారణముగా అడ్జర్న్ మెంటు ప్రతిపాదనము వచ్చినపుడు, వెంటనే అసలు విషయములనుగూర్చి ప్రకటన నొకదానిని చేయుచుండెడివారు, ఇపుడు వానికి భిన్నమైన వైఖరి నవలంబించినందుకు ఆశ్చర్యపడిరి. హైకోర్టువారు తమవద్దకువచ్చిన రికార్డులనుబట్టి తమనిర్ణయము చేసియుండిరనియు. ప్రభుత్వమువారిపుడు గైకొనిన చర్యను గైకొనియుండుటకు వారలకు క్రొత్తవిషయము లేవియైనను తెలిసియుండవచ్చుననియు మెహతా గారనుచు, ప్రభుత్వపక్షమున ఒక ప్రకటన నపేక్షించిరి.

రాజకీయఖైదీలను వదలుటకు ఎంతో తతంగము జరిపినవారు దుష్టమైన నేరము చేసినవానినేల అంతత్వరగా వదలిపెట్టవలెనని ఆశ్చర్యపడిరి. ప్రభుత్వచర్యచే హైకోర్టు నిందసా[illegible], న్యాయముయొక్క మూలమే విచ్ఛేదింపబడినది. మెహతా గారు ఖానూను ప్రకారము ప్రభుత్వచర్య నిందితమని చెప్పియుండ, తాను నీతిశాస్త్రప్రకారము ప్రభుత్వచర్య దూషితమనుచుంటిననిరి.

ఆలీబహదర్ ఖాన్ గారు ప్రభుత్వ పక్షమున వాదించుచు, విడుదలగాని తాత్కాలికముగ శిక్ష అపుదలగాని ఒక్క రాజకీయ ఖైదీలకే సుత్తాగా నుండరాదనిరి. రష్యాలో ఖైదీల తాత్కాలిక విడుదలలు ప్రతిదినము జరుగుచుండుననిరి.

అంబేద్కరుగారు అడ్జర్న్ మెంటు ప్రతిపాదనను సమర్థించుచు, ఇది ఆకస్మికముగ రాలేదనిరి,

"అధికారము స్వీకరించినతర్వాత కాంగ్రెసు పక్షమువారు చేసిన శాసనోల్లంఘన చర్యావళియొక్క ఫలితమే ఇది" యనిరి. అంబేద్కరుగారంత, ప్రభుత్వమువారు శాసనోల్లంఘన సమయములో ఊడగుంజుకొనిన భూములను తిరిగి వాపసిచ్చుట, మున్నగువాటిని పేర్కొనబోగా, అధ్యక్షులవారు ప్రస్తుత విషయమును మాత్రమే మాట్లాడవలసినదనిరి. అంబేద్కరు గారు తానా ప్రాతవిషయములను గూర్చి చర్చ చేయుటలేదనియు, వాటిని పోలికకు మాత్రమే తెచ్చియుంటిననియు చెప్ప అధ్యక్షులవారు అట్లుచెప్పుటగూడ ప్రస్తుతాంశము నిష్పక్షపాతముగ చర్చించుటకు వీలులేకుండ చేయునని అడ్డుపడిరి.

అంత అంబేద్కరు గారు తమ వాదమును సాగించుచు హైకోర్టువారికి శిక్షలను తాత్కాలికముగ ఆపుటకు అధికారము లేదుగాని, ప్రస్తుతము చర్చించదగిన విషయము శిక్షను తాత్కాలికముగ ఆపుటకు ప్రభుత్వము వారికి గల అధికారము సరిగా వినియోగించబడినదా యనునది యనిరి. దీనిని నిర్ణయించుటకు కొన్ని అంశములను స్పష్టముగ తెలిసికొనవలెను.

మొదటియంశ మేమనిన నేరస్థులు జూదపు పనులచేగాని పొట్ట గడుపుకొనలేనంత దరిద్రులుగారు, వారలు కోటీశ్వరులు.

రెండవయంశ మేమనిన శిక్షయొక్క తాత్కాలికపు తగ్గింపునకై ఈయబడిన దరఖాస్తు జబ్బు కారణముచేగాని, కుటుంబములో ఏదేని ఉపద్రవమును కారణముచే గాని ఇవ్వబడియుండలేదు.

మూడవదేమనిన పై న్యాయస్థానములో మురాఫా చేసికొను విషయ మాలోచనలో నుండెననునది. కాని ఇటువంటివాటిలో మురాఫాను ప్రీవీకౌన్సిలు అంగీకరించదని తనకంటె గొప్ప ఖానూను తెలిసినవాడగు హోంమెంబరు మున్షీ గారికి తెలిసియుండవలెను.

ఆఖరువిషయ మేమనిన శిక్షయొక్క తాత్కాలికపు విడుదలకై చేయబడిన యాజ్ఞను హోంమెంబరుగారే స్వతంత్రించిచేసిరో లేక ప్రధానమంత్రి నడిగియే చేసిరో తెలియుటలేదు.

### హోంమెంబరుగారి సమాధానము

ఈవిధముగా వార్తాపత్రికలలో వచ్చినదానిని పట్టి ఆక్షేపించబూనినచో ఏ ప్రభుత్వముగాని పని సాగించజాలదని హోంమెంబరుగారనిరి. ప్రభుత్వ సభ్యునినుండి విషయములను తెలిసికొనక, ప్రభుత్వము వారు తప్పుచేసిరని నిర్ణయించుట బాధ్యతగలవారు చేయదగిన యాక్షేపణ గాదు అనుచు హోంమెంబరు మున్షీ గారు అసలు విషయములను చెప్పిరి. ఈ కథకును, మొదటనే జమ్నదాసు మెహతా గారు అడ్జర్న్ మెంటు ప్రతిపాదనచేయుచు చెప్పినకథకును మూడుచోట్లనే భేదము గలదు. ఆ భేదమైనను ఒక్కదానిలోతప్ప, జమ్నదాసు గారు చెప్పినదానిని ఖండించునదిగ లేదు. ఆ మూడును జమ్నదాసు గారు చెప్పినదానిలో లేని విశేషములు. నేరస్థులు హైకోర్టుకు మురాఫా చేసినపుడు, హోంమెంబరుగారు ప్రధాన మంత్రి నడుగకయే ప్రభుత్వపు న్యాయవాదికి నేరస్థులశిక్ష ఇతరులకు బుద్ధిచెప్పునంతదిగా నుండవలెనని హైకోర్టును కోరుటకై ఆజ్ఞను పంపిరనునది మొదటివిశేషము. హైకోర్టువారు జార్మానాకు ఆరునెలల కఠిన కారాగారవాస శిక్షను కూర్చిరనునది రెండవ భేదము, మూడవదేమన, హైకోర్టువారు శిక్షితులు తాత్కాలికముగ తమశిక్ష నాపుదల చేయవలెనని కోరినపుడు ఆకోరికను నిరాకరించుటకు కారణము హైకోర్టువారికి ఆకోరికతీర్పు అధికారములేదని చెప్పబడుట. హైకోర్టువారిట్లు నిరాకరించిన తర్వాత ప్రభుత్వము వారివద్ద నేరస్థులు తాము ప్రీవీకౌన్సిలుదగ్గర మురాఫా చేసికొనుట కేర్పాటు గావించుకొనుటకై శిక్షను తాత్కాలికముగ ఆపుదలచేయవలసినదిగ కోరుచు ఒకదరఖాస్తు పెట్టబడెను కాని అది నిరాకరించబడెను. మరుసటిరోజు ఇంకొకదరఖాస్తు వచ్చెను. నేరస్థులబంధువులందరు హరిపుర కాంగ్రెసుకు పోయిరనియు రూ. ౨౦౦౦౦ల ఆదాయపుపన్ను చెల్లించగలిగి భారతదేశమందంతటను వ్యాపించియున్న వారల వ్యాపారము నష్టపడుననియు ఆదరఖాస్తులో నుండెను. పోలీసు కమిషనరు గారిద్వారా నేరస్థులనుగూర్చి విచారణ చేసి, తగిన ముచ్చెలికా, జమానతులు గైకొని [illegible] కాలము శిక్ష నాపుదల చేయుటకు ఉత్తరువు చేయబడెను. పూర్వపు ప్రభుత్వములు ఇట్లు అధికారముల నుపయోగించి యుండెననియు, శిక్షవేయబడినవెంటనే శిక్షితులు ప్రభుత్వపరమగుదురు కాబట్టి ప్రభుత్వము వారి ప్రస్తుతచర్య న్యాయస్థానముల స్వాతంత్ర్యమునకు భంగము కలిగించునది గాదనియు మున్షీ గారు [illegible]చిరి.

### మిమ్ములను వెళ్లగొట్టెదము

జమ్నదాసు గారు చర్చకు సమాధానమిచ్చుచు వార్తాపత్రికలోని సమాచారము నాధారముగ తీసికొనరాదను ఆక్షేపణను తా నంగీకరించజాలననెను. క్రొత్త సంగతి మరియేవిధముగ తెలియును?

నేరస్థులు కోటీశ్వరులనువాదముతప్ప ప్రభుత్వచర్యను సమర్థించుటకు మరియేసమాధానము లేదు. శిక్షను హెచ్చించవలసినదని మొదట అడిగియుండిన ప్రభుత్వమువారు తుదకు ఇపుడు గైకొనియుండిన చర్య గైకొనుట క్షంతవ్యము కాదు. ప్రభుత్వము వారి నోటవచ్చిన మాటలే, వారలను దూషితులనుగ జేసినవి.

"హోంమినిస్టరు గారి ఉపన్యాసము వారి గర్వస్థితిని పొగరును మాత్రమే సూచించినవి. ఈ ప్రభుత్వమును ఎంతదూషించినను ఎక్కువగాదు. మేము మిమ్ములను కొద్దికాలములోనే ఊరుపేరులేకుండ తరిమివేసెదము," అని మెహతా గారు ముగించిరి.

అంత ఓట్లుగైకొనబడగా అడ్జర్న్ మెంటు కనుకూలముగ [illegible] ఓట్లును వచ్చుటచే, ఓడెను.

# కడపటివార్తలు

## సింగరేణియందు ౫౦ గురి హఠాత్తుక మరణము

బొగ్గుగనులందు నిప్పంటుకొనుట

ముగ్గురు ఆంగ్లేయులు మృతినొందుట

(గోలకొండ విలేఖరి)

హైద్రాబాదు; మార్చి ౧౪

బెజవాడనుండి ౯౨ మైళ్లదూరమునను హైద్రాబాదు నగరమునుండి సుమారు ౧౫౦ మైళ్లదూరమున నుండు సింగరేణి బొగ్గుగనుల లో నొకదానియందు శనివారముదయము అకస్మాత్తుగా నిప్పంటుకొనెను. దగ్గరనున్న వారు ఈవిషయము స్థానిక జనరలు మేనేజరు గారగు అండ్రూసు గారికి తెలియపరచిరి. కొలదికాలములోనే అండ్రూసు గారు మరిద్దరు ఆంగ్లేయాధికారులతో గూడి నిప్పంటుకొను బొగ్గుగనిచేరి అందు పనివారల ప్రవేశింపజేసి తాముసు వెడలిరి. నిప్పుచల్లార్చ బడిన తరువాత వారు తిరిగి వచ్చుచుండగా గనియందు నొప్పకట్టమై అగని కూలిపోయెను. దీనివలన అండ్రూసు గారితోకహా ముగ్గురు ఆంగ్లేయులు ఇతరులు కలిసి సుమారు ౫౦ గురు మరణించి రనియు ౧౭ గురు గాయస్థులైరనియు తెలియుచున్నది.

హైద్రాబాదునుండి నిన్నసాయంకాలము ఒకస్పెషలుబండి సింగరేణి పంపబడినది. ఇందుకొందరు డాక్టరులు నర్సులు రైల్వే యేజంటు గారు గలరు.

## ప్రజాసేవకుల అరెస్టులు

భూస్వాములు, వర్తకులు పోలీసువారి దృష్టికి గురియగుట.

పోలీసువారు బేడీలుపెట్టి నగరమునందు వీరల ద్రిప్పుట

ప్రజలలో ఆందోళనము.

[గోలకొండ విలేఖరి]

నిజామాబాద: మార్చి ౧౪

మొహర్రం హోళీపండుగ లొకే సమయమున తటస్థించినందునను, యిదివరకు కచ్చీవు సీరునందు బకరీదు పండుగ సందర్భమున గోవధ జరుపబడుటచే నగరమందలి ప్రజలలో చెలరేగిన ద్వేషవ్యాపారములు దుష్కృత్యములు కలిగించ కుండుటకై జిల్లా మేజస్ట్రేటు గారు పోలీసు అధికారుల రిపోర్టులపై నగరమునందు ౧౪౫ (సెక్షను జాబితా ఫౌజ్దారి సర్కార్ ఆలి) అమలునందు పెట్టిరి.

నేడు మధ్యాహ్నము ౧౨ గంటలకు సర్కిల్ యిన్స్పెక్టరుగారు మొహర్రిరుగారిని క్రింది మహాశయులను స్వంతకార్యమున్నదని పిలిపించిరి.

౧. సి. మాణిక్ రెడ్డిగారు, సాహుకారులు గంజులో గొప్పవర్తకులు

౨. సేటు రామాకిషన్ గారు, గంజులో పేరుగాంచిన వర్తకులు

౩. సాంబయ్య ఆచారిగారు, విశ్వకర్మ సంఘాధ్యక్షులు

౪. మునిపల్లె శ్రీనివాసగారు ౨ లక్షల ఆస్తిగల భూస్వాములు

౫. మాస్టరు, రఘువీరసింగు గారు

మొహర్రిరు గారు పైమహాశయులను మోటరుద్వారా పోలీసుస్టేషనుకు సుమారు ౧ గంటకు తీసుకవచ్చిరి. సర్కిల్ ఇన్స్పెక్టరుగారు మహాశయులతో ముచ్చటించుచు అరెస్టు చేయుటకు కనున్నచెయు పోలీసువారు తక్షణం అరెస్టు చేసిరి.

పోలీసు యిన్స్పెక్టరుగారు మాస్టరు రఘువీరసింగుగారిని కరమీను అగుటంజేసి దయతో వారిని స్టేషనుయందే యుంచి మిగత వారలకు బేడీలుపెట్టించి యిద్దరిద్దరు చొప్పున ఒక కొన్స్టేబిలుతో నగర వీధులన్నియు త్రిప్పిరి. పోలీసువారు రిమేజన్స్ట్రేటు ఆజ్ఞవలన యేసెక్షనుప్రకారము వీరిని అరెస్టుచేసిరో తెలియుటలేదు. విచారించ తెలుపుటకునిరాకరించిరి.

దీనివలన నగరమునందు తీవ్రమైన ఆందోళన చెలరేగుచున్నది. మరికొన్ని అరెస్టులు జరుగనున్నటుల కింవదంతులు బయలుదేరినవి.

(తంతివార్త)

హోలీ సెలవు

హోలీ పండుగ కారణముచే గురువారము పత్రిక వెలువడదు.

వ్యవస్థాపకుడు.


# గోలకొండపత్రిక

ఈశ్వర నామ సం॥ర ఫాల్గుణ శు॥ ౯

గురువారము


## ఉస్మానియా స్నాతకోపన్యాసము

డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారు మన ఉస్మానియా విద్యాపీఠస్నాతకుల సమావేశమునందు గావించిన ఉపన్యాసములో స్నాతకులకు చేయవలసిన ఉపదేశములకు సంబంధించిన అంశములు విశేషములేవు. ఉన్నత విద్య నేర్చినందుకు గర్వపడక వినయవంతులుగ నుండవలెననియు, అవిచారితముగ పరుల ననుకరించుట మంచిదిగాదనియు, అన్నియు నశించు చున్నను శాశ్వతముగ నుండు ఒక పదార్థమున్నదని విశ్వసించుట మంచిదనియు —ఇంతకుమించి డాక్టరు రామలింగారెడ్డిగారు నేరుగా స్నాతకులగు పట్టభద్రులను గూర్చి చేసిన ఉపదేశములేవియు లేవు.

ఉపన్యాసమందు అధికభాగము మన నిజాంరాష్ట్రముయొక్కయు, ఉస్మానియా విద్యాపీఠముయొక్కయు, అందును విశేషించి ఆంధ్రుల యొక్కయు ప్రశంసలో నిండియున్నది. ప్రాచీనకాలమునుండియు ఆంధ్రులకును హైదరాబాదు సంస్థానమునకును గల చారిత్రిక సంబంధమును సంక్షేపముగ వర్ణించి ఇపుడు హైదరాబాదు ప్రత్యేక వ్యక్తిత్వమును పొందినతర్వాతగూడ, ఇక్కడ ఏర్పడిన దక్కను నాగరికత యనునది చిరకాలముగా ఆంధ్రులకును ముసల్మాన ప్రభువులకును ఉండిన అన్యోన్యానుకూల భావముయొక్క క్రమ వికాస ఫలితమని విశదముగ చూపించినారు. అద్దంకి గంగాధరకవి తన తెనుగుకావ్యమును గోలకొండ నేలుచుండిన ఇబ్రహీంకుతుబ్ షాకు అంకితము జేయుట, తానీషావద్ద అక్కన్న మాదన్నలు ప్రధానమంత్రి సేనానాయకులుగ నుండుట, తానీషాకు కలలో హిందూదేవతలగు రామ లక్ష్మణులుకనిపించి రామదాసును చెఱనుండి విడుదల చేయించినట్లు పురాణమేర్పడుట — ఇది యంతయు దక్కను నాగరికత నిర్మాణములో చేరిన అంశములకు సూచనలుగా డాక్టరు రెడ్డిగారిచే పేర్కొనబడినవి. ఈ చరిత్రవలన దక్కను నాగరికతయందు ముఖ్యలక్షణమని తెలియుచున్న అంశము హిందూ ముసల్మానుల ఐహికైకమత్యముమాత్రమే గాక, ఆముష్మికైకమత్యము అనికూడ డాక్టరు రెడ్డిగారు స్పష్టముగ చెప్పినారు. తుదకు ఈవ్యక్తిత్వలక్షణమును సంరక్షించి విభేదములతో విసిగియున్న ప్రపంచమునకు ఈ ఐకమత్యకరదీపికతో మార్గముజూపుట హైదరాబాదు సంస్థానముయొక్క కర్తవ్యమనుచు, డాక్టరు రెడ్డిగారు ఇట్లు సందేశమొసగినారు: "హైదరాబాదు దర్పణము అక్బరుమహాశయుని జ్యోతి భారతదేశమంతటను ప్రతిఫలింప జేయవలెను."

మ. ఘ. వ. నిజాం ప్రభుత్వమువారు రైట్ ఆనరబిల్ సర్ అక్బర్ హైదరీగారి ప్రేరకత్వమున, ఈ సందేశ పరిపాలనకు అనేకవిధముల సేవజేయుచున్నారు. అందొకటి అజంతా గుహలలో శిల్ప, కళాశేషములను సంరక్షించుట కేర్పాట్లుచేయుట, రెండవది ఉస్మానియా విద్యాపీఠ నూతన భవనములను, మహమ్మదీయ శిల్పలక్షణములను సమ్మేళనము చేయుట — ఇవి ఇటువంటివే. ఇపుడు ఈవరుసలో ఈ రాష్ట్రమందు ప్రాచీన సంస్కృతాంధ్ర గ్రంథములను సేకరించి, సంరక్షించి, ప్రకటించుటకు ప్రభుత్వమువారు తలపెట్టియున్నట్లు తెలియుచున్నది.

ఉస్మానియా విశ్వవిద్యాపీఠమును గూర్చి డాక్టరు రెడ్డిగారు చేసిన రెండు సలహాలు విలువగలవి. అందు మొదటిది స్త్రీవిద్యను గూర్చినది. స్త్రీలను మంచి ఇల్లాండ్రనుగ తయారుచేసి గృహములను ఆనందకందములనుగ జేయుటకు ఉపకరించగల విద్యాలయములను ఏర్పాటు చేయవలసిన అవసరమును శ్రీయుత రెడ్డిగారు సూచించిరి. అయితే ఈ సూచనకు ముందే ఉస్మానియా విద్యాపీఠమందు అట్టి ఉద్దేశ్యముతో నొక ప్రణాళిక తయారై ఆమోదము పొందియున్నది. ఈ ప్రణాళిక అమలుకువచ్చినపుడు విద్యను విద్యార్థినుల మాతృభాషలో బోధించు ఏర్పాటు ఉండిననే గాని జనులెక్కువమంది లాభము పొందజాలరు.

శ్రీయుత రామలింగారెడ్డిగారు చేసిన రెండవ సూచన కొన్ని విలువగల శాస్త్రీయపరిశోధనలను చేయించుటయందు ఈ దేశమందలి ఇతర విశ్వవిద్యాపీఠములకంటె ఉస్మానియా విద్యాపీఠస్థితి ఎక్కువ అనుకూలముగ నున్నదనునది. ఈసందర్భమున "అటామిక్ ఫిజిక్సు" సంబంధమైన పరిశోధనకై ఒక పరిశోధనాలయమును (లాబోరీటరీని) స్థాపించుట ఒక ఉదాహరణముగ చూపబడినది. మన ప్రభువరేణ్యులు గూడ ఉస్మానియా విద్యాపీఠమందు నూతన శాస్త్రసంబంధములైన పరిశోధనలయొక్క అవసరములను గూర్చి ప్రత్యేకముగ నొక్కి చెప్పియున్నారు. నిజముగా విశ్వవిద్యాపీఠములకు మంచి నూతనశాస్త్ర పరిశోధన ఫలితములు చాలగొప్ప గౌరవ ప్రతిష్ఠల నొసగును. మన ప్రభుత్వమువారు బయటి దేశములకు, సంస్థలకు, పుణ్యతీర్థయాత్రలకు దానము లిచ్చుటకు ముందు ఈపరిశోధనావసరములను గుర్తించి పోషించుటకు శ్రద్ధవహించుచో, వారికి నిజముగా గొప్పఖ్యాతి లభించగలదు. మరియు అట్టి ఉపయోగకరములైన నూతన పరిశోధనలచే మన రాష్ట్రమునకేగాక దేశమునకంతటికిని ఎంతో ఉపకారము కలుగవచ్చును.

## వికలాంగుల శరణాలయం సికిందరాబాదు

సికిందరాబాదునందలి "వికలాంగుల శరణాలయము"యొక్క ౧౯౩౬ సం॥పు నివేదిక మాకు చేరినది. ఈనివేదిక కాలముయొక్క ప్రారంభమందు శరణాలయములో ౧౨౪మంది ఉండిరి, ౧౩౪ మంది క్రొత్తగా చేర్చుకొనబడిరి ౨౯ మంది కాలగతి నొందిరి, ౧౧ కుష్ఠరోగులు డిచ్పల్లిలో కుష్ఠరోగి శరణాలయమునకు పంపబడిరి, ౬౦ వండ్ల వయసుగల ఇరువురు వృద్ధశరణాలయమునకు పంపబడిరి, ౮౭ మంది ఈశరణాలయములో కొంతకాలముగడపి, తమంతటతామే లేచిపోయిరి. క్రొత్తగా నివేదిక సంవత్సరమందు చేర్చుకొనబడిన ౧౩౪ మందిలో ౭౮ మంది పురుషులు, ౪౫ మంది స్త్రీలు, ౮ మంది బాలురు, ౩ గురు బాలికలు.

ఈ శరణాలయమందు శాశ్వతముగనుండు వారలు విశేషముగ గ్రుడ్డివారలును, కుంటివారలును, పక్షవాతబాధితులును, తీవ్రకుష్ఠరోగపీడితులును, వికల మనస్కులును నైయున్నారు. వీరలలో చాలమంది వీధులలో దిక్కులేక తిరుగుచుండినపుడు చూచి తేబడినవారలైయున్నారు. కొందరుస్వయముగనేవచ్చి చేరెదవారు. ఈశాశ్వత నివాసులకు వారల మరణ పర్యంతరము శ్రద్ధతో పోషణచేయబడు చున్నది. ఈ పోషణకై రూ. ౬౧౨౧-౭-౭ ఖర్చైనట్లు చూపబడినది. తక్కిన ఖర్చులన్నియు కలిసి మొత్తము ఖర్చు రూ. ౮౩౬౬-౧౩-౭ లు. మొత్తము ఆదాయము ౯౭౭౩-౦-౧౦ లు.

శరణాలయ నివాసులు దండుగ పోషణ ననుభవించుట లేదనియు, వారలవల్ల కొంతపని జరుగుచున్నదనియు తెలుపబడిన విషయము సంతోషకరమైనది. వారలకు టేపుఅల్లిక, చేతిపని నేర్పబడు చున్నవి. ఆ టేపులను, ఇతర వస్తువులను అమ్మగా రూ.౧౦౫-౧౫-౦ లు వచ్చినవి. శరణాలయము యొక్క ఈ లక్షణమును పెంపొందించుటకు నిశేషశ్రద్ధవహించి, శరణాలయ నివాసులు ఈ లోకమున తమశక్తికి లోబడి ఏదో యొకవిధముగ ఉపయోగకరమయిన జీవనము గడపునట్లుచేసి, వారలయందు ఆత్మవిశ్వాసమును పెంపొందించి, సుఖవంతులను జేయుటవలన శరణాలయము యొక్క ప్రతిష్ఠ హెచ్చగలదు.

ప్రస్తుత శరణాలయములో చోటుచాలనందువలన పోషణకు అర్హులైన అనేకులు చేర్చుకొనబడుట లేదని నివేదికలో చెప్పబడినది. వారలకై మెట్టుగూడెములో ౭౫ ఎకరములభూమి కొని అక్కడ క్రొత్తశరణాలయమును స్థాపించదలచ బడినది. అంతేగాక రూ. ౫౦౦౦ ల అప్పు తీర్చవలసియున్నది. వీటికన్నింటికిని రూ. ౨౫౦౦౦ పెట్టుబడి అవసరమని కార్యనిర్వాహకవర్గమువారు విన్నవించుచు, కేవలము ప్రజల విరాళములపై జీవించుచున్న ఈ సంస్థ కిపుడు సహాయ మపేక్షించుచున్నారు. ప్రజలు ఇందుకు తప్పకతోడ్పడగలరని నమ్ముచున్నాము.

ఏ సంఘముయొక్కగాని, ఏరాజ్యముయొక్కగాని నాగరికతను ఆసంఘమునందుగాని, ఆరాజ్యమందుగానిఅతిధనవంతులను బట్టి కొలుచుట మంచిపద్ధతి గాదు. సంఘములోను, రాజ్యములోను ఏకారణముచేగాని దిక్కులేని స్థితిలో నున్నవారల సౌఖ్యముసకై మంచి ఏర్పాట్లుచేయబడినపుడే, ఆసంఘము, ఆరాజ్యము నిజముగా నాగరికత జెందినదనవలెను.

## బస్తాలుకూలుటచే మరణము

హైదరాబాదు మార్చి ౧౪

నేటిమధ్యాహ్నము సుమారు ఒంటిగంట వేళ ఉస్మాన్ గంజులో బస్తాలుకూలి ఇరువురుకూలివారలు దారుగుకిపై బడెను. ముగ్గురు చాల ప్రమాద స్థితిలో నున్నారు.

## జాతికి బోసు సోదరుల విరాళము

కలకత్తా, మార్చి ౧౨

కాంగ్రెసు మహాసభాధ్యక్షులగు శ్రీ బాబు సుభాషుచంద్ర బోసుగారు, వారిసోదరులు నటకమందలి తమసౌధమును భారతజాతికి ధారాదత్తముగా నొసగిరి. బోసుగారి జనకులగు కీ. శే. జానకీనాథ బోసుగారి సౌధమును కొన్నిలక్షలు వెచ్చించి నిర్మించిరి. ఇది నగరమందలి యుత్తమప్రదేశమున సుమారు రెండు యెకరముల ఆవరణలోగలదు. దానపత్రముభారత జాతీయ మహాసభపేర పూర్తిచేయబడినది. ఒరిస్సా రాష్ట్రీయ కాంగ్రెసు సంఘమునకిదిముఖ్య కేంద్రస్థానముగా నిర్ణయింపబడ నున్నటుల తెలియుచున్నది.

## 'బాధ్యతాయుతపరిపాలనా' శబ్దములు భయానకములా? న్యాయ విరుద్ధములా?

### స్వీయ పరిపాలనమునకు మైసూరుప్రజల అర్హత

### సంస్థానాభ్యుదయమునకు బాధ్యతాయుత ప్రభుత్వ మత్యవసరము

### రేలీ విచారణ సంఘముపై కె. టి. భాష్యముగారి సదభిప్రాయము

[గోలకొండ విలేఖరి]

బెంగుళూరు, మార్చి ౧౦

సంస్థానమునందురాజకీయ సంస్కరణముల ప్రవేశపెట్టుటకు ప్రభుత్వము వారిటీవల సంస్థాన ప్రధానామాత్యులగు దేవిగారి యధ్యక్షత క్రింద విచారణసంఘ మేర్పరచిన విషయము పత్రికాపాఠకులకు విదితము. దేశీయుల అభివృద్ధి, బాధ్యతాయుత ప్రభుత్వ నిర్వహణ సామర్థ్యముల విచారణ కేర్పడిన యీసంఘముగురించి శ్రీ కె. టి. భాష్యముగారిటుల ప్రతికాప్రకటనము గావించుచున్నారు:—

"ప్రజాప్రతినిధుల యొన్నికలవలనశాసనసభలకు సంస్థానాధిపతి తప్ప వివిధ శాఖామాత్యులు బాధ్యులుగానుండుటయు, వీరల తొలగించు అధికారము శాసనసభల కేర్పడియుండు ప్రభుత్వవిధానము బాధ్యతాయుతప్రభుత్వమని వ్యవహరింపబడుచున్నది. ఈదృష్టితో దిలకించిన యీ మైసూరు సంస్థానమునందు అమాత్యులు, ప్రధానామాత్యుడు ప్రతినిధి సభాసభ్యుల లేక శాసనసభల సూచనలపై యెన్నుకోబడిన సభ్యులనుండి నియమింపబడవలయును. ప్రస్తుతము భావిశాసనసభల అధికారములు, నెందులగు వివరములు వివరించు టనవసరము."

"ఆ నూతన ప్రభుత్వమునందలి ముఖ్యవిషయములుగా నుండవలయును:—

ఘ. వ. మహారాజాగారు పాలనమునందున్న తాధికారిగా యేర్పడి ప్రతివిషయమునందు చివరాంగీకారము వారిదైయుండవలయును.

వీరికిసాయమొనర్చ పౌలకవర్గమునందు ౫ లేక ౭ గురు సభ్యులుండవలయును. శాసనసభయందధిక సంఖ్యాబలము కలిగినవారిని వీరు అధ్యక్షులుగా యెన్నుకోవలయును. మిగతసభ్యులు అధ్యక్షుల—ప్రధానామాత్యుల సూచన ననుసరించి యేర్పడవలయును.

శాసనసభయందు దళము ప్ర. శ. ౭౫ మంది నియోజక ప్రతినిధు లుండవలయును.

ఉన్నత న్యాయస్థానము, దీనికి లోబడియుండు క్రిమినల్, సివిల్ న్యాయస్థానములన్నియు జ్యుడీషరీ అధీనములు, న్యాయపరిపాలనా శాఖలు వేరువేరుగా నుండు టత్యవసరము. శాసనము వలన న్యాయశాఖ పరిపాలనము, న్యాయమూర్తుల యుద్యోగకాల పరిమితి, వారి వేతనములు నిర్ణీతములు కావలయును

శాసనములవలన నిర్ణీతములగు ప్రజల ప్రాథమిక పౌరసత్వములు న్యాయశాఖవలన సంరక్షితము లగుచుండును."

వీనిలో యెన్నిసంస్కరణములు విచారణ సంఘమువారివలన ప్రవేశపెట్టబడునో యింకను చర్చనీయాంశముగా గలదు. అయినను వీరిసూచనలు ప్రజలవలన చర్చింపబడకుండుటచే ప్రభుత్వము ప్రజాభిప్రాయానుసారము ఆచరించుటకు బూనుకొనగలరని విశ్వాసముగలదు.

"ఈసంఘనిర్ణయముతో యేవోకొన్ని సంస్కరణలు ప్రవేశపెట్టదలచకప్రభుత్వము వారు బాధ్యతాయుత ప్రభుత్వము స్థాపించుటయే వారి యుద్దేశమనునది ప్రజలకు విశ్వాసముకలిగించుట ముఖ్యధర్మము. నాత్రూపమున పరిపాలనముతో ప్రజాసంబంధ మేర్పరచుటకు సంఘము తలపెట్టి తీర్మానకానుకూలముగా సూచించినవారి కృషి కేవలము నిరర్థకము. కాలము మారినది, ప్రజలయందు జాగరూకావస్థ కలిగినది. ప్రపంచమేగాక చుట్టుపరిస్థితులన్నియు బాధ్యతాయుత ప్రభుత్వస్థాపనకు ప్రజల నుద్రేకించుచున్నవి. ప్రజల యీకోరిక హృదయావందము గాదు. నూతనముగాదు. ప్రతిదేశమునందు కోరబడినది. కోరి అనుభవింపబడుచున్నది ఇతరదేశములం దెప్పుడో ఆచరింపజేయబడినది. మేము మాజన్మహక్కుగా దీనిని కోరుచున్నాము, మా యీ హక్కు న్యాయసమ్మతము, కాబట్టి మేము దానికి అర్హులమాయను విషయమనవసరము.

"ఐనను మేము దానికి పరిపూర్ణార్హులము. విజ్ఞాన మెకరిసొత్తుగాదు. అది సమయానుసారావసరము. ప్రజలకు తమ శక్తిసామర్థ్యములు వివిధపరమ పరిపాలనాపదవులు ప్రసాదించిన వారియోగ్యతలు నిరూపితమైనవి. వివిధశాఖల యోగ్యాధికారులాధీనమైయుండిన సామర్థ్య వ్యక్తియును పరిపాలనాధర్మముననుసారిత్వము వహించుటలో వాక్సర్యములేదు. ప్రజా సేవయే పరమోద్దేశముగా నిర్ణయించి సాధించు కేవాధురీణు లెన్నుకోబడిన దేశక్షేమము, సౌభాగ్యము, అభివృద్ధిసురక్షితము, నిశ్చయసాధ్యము. సంఘమువారి సూచనలు ప్రకటితములైన పిదప మహారాజాగారు తమ అధికారము వెంటనే ప్రజలకొసగెదరని చూడవలయును".

"బాధ్యతాయుత ప్రభుత్వస్థాపనమే యుద్దేశమైనపుడేల ప్రభుత్వము తనకార్యము ప్రజలకు విదితపరచదో బోధపడుటలేదు. ఇది అంతభయంకరమైనదిగాదు. బాధ్యతాయుత ప్రభుత్వమున్నంత మాత్రమున సంస్థానాధిపతులు నిష్క్రియమనుట కాజాలదు. అవసరమున్న "మహారాజా గారి ప్రభువు"యని నిర్ణయించవచ్చును. పార్లమెంటునందు సహితము నూతనయుగము శాసనోద్దేశము భారతవర్షమునకు బాధ్యతాయుత ప్రభుత్వమునే నిర్ణయింపబడినది. ప్రజాసత్తరాజ్యమునందు శాసనాభివృద్ధి అదృశ్యమనినాడే రాజకీయవేత్తలు నిర్ణయించిరి".

## మదరాసులో ట్రాంబండ్లసమ్మె

మదరాసు: మార్చి ౧౨

నిన్న మదరాసు ట్రాంవే యూనియను యొక్క ౧౫ వందల సభ్యులు, వీరియందు ౧౦౦ మతవిశ్రేణులు గలరు. సమ్మెజరుపు విషయ మాలోచించిరి. కాంగ్రెసు సోషలిస్టు సంఘ కార్యదర్శులగు శ్రీనివాసరావుగారు సమ్మెసలుపుటకు ౧౪౪౫ వోట్లు పొందినట్లు, ౫ గురు మాత్రము ప్రతికూలముగా సమ్మతి వెలిబుచ్చినటుల వివరించిరి. కార్మికనాయకులు కార్మికుల యీ ప్రజాభిప్రాయమును పోర్టు పరచుటకు హెచ్చరించిరి.

## కాంగ్రెసు విజయము

(గోలకొండ విలేఖరి)

బెంగుళూరు, మార్చి ౧౨

ఇటీవల ప్రభుత్వమువారు సంస్థానమునందు కాంగ్రెసు యుద్యమము నణచివేయుటకు అవలంబించిన నిర్బంధవిధానముల తలయెత్తకొనిరి. ఖాళీయైన ౧౧స్థానములకు తిరిగి సభ్యులపోటీకి నిలబెట్టిన ౧౧గురు అభ్యర్థులు జయముపొందిరి దీనివలన ప్రజలకు కాంగ్రెసు యెడగల భక్తి విశ్వాసములు ప్రభుత్వమునకు విదితమైనదనుటలో అతిశయోక్తి లేదు.

యువకులు

వృద్ధులు

ఇటీవల దివాన్ గారికి, టి. సిద్దలింగయ్యగారికి జరిగిన సంప్రతింపుల చర్చించి భావి కార్యక్రమము నిర్ణయించుటకు కాంగ్రెసు కార్యకారిణీ సమావేశము జరిగెను. అసభయందు కొందరు యువకులు తమను పద్ధతుల నేర్పరచవలెనని వనికోర వృద్ధనాయకులు అంగీకరించిరి. వీరివిర్ణయము దేశద్రోహకరమని యువకులు-సామ్యవాదులు-ప్రత్యేక సభద్వారా తీర్మానించిరి.

ప్రభుత్వమువారు తమయుద్దేశము సంపూర్ణముగా నిర్వచించవంతవరకు కాంగ్రెసువారు కార్యము సలుపుటకు నిశ్చయించినటుల తెలియుచున్నది. కాని యువకులు మాత్రము ప్రభుత్వము నిర్వచించినను లేకున్నను యొకేటే యనియు, ప్రభుత్వమువారు విచారణసంఘమునందు కాంగ్రెసుసభ్యుల చేర్చనంతమాత్రమున స్వర్గసౌఖ్యము కలుగజాలదనియు, ప్రజలు స్థిరచిత్తముతో తమకోరికలు బహిరంగముగా విశదపరచినంతవరకు ప్రభుత్వము లొంగదని అభిప్రాయ మొసగిరి.

# విజయనగర సామ్రాజ్యమూలము

[౨వ పేజీతరువాయి]

న మండవలెను. లేదా వారికంటె పూర్వపు ప్రసిద్ధిచారిత్రికులనుండి గ్రహించిన విషయమా?

ఇట్టి దిగ్భ్రమ కలిగించు సాహసములను చూచినచో విమర్శకపాఠకులగు చారిత్రికులు స్పష్టముగా భయాశ్చర్యచకితులగుదురు. బహుశా అవిచ్ఛిన్నముగా అచక్రవర్తి యైనను అయియుండవలెనని సూచించుటకు ఎవరుగాని సాహసించజాలరు. కాని మహామండలేశ్వర శబ్దము సామంతరాజార్థకమున్నట్లు సూచించురీతిగ సరిపోలు వ్యవస్థాసంబంధమైన అర్థమును సూచించుటకు ఈ చరిత్రకారులను ప్రేరేపించుచున్న అంత యావశ్యకమేమి? కాకతీయ చక్రవర్తులు, హోయసల చక్రవర్తులుకూడ "మహామండలేశ్వరుల" మని చెప్పుకొనిన శాసనములనేకములున్నవి. వారలు స్వతంత్ర చక్రవర్తులు, సార్వభౌములు. కానిమన ఆధునిక చరిత్రకారుల దృష్టిలో వారలు మహామండలేశ్వరులని చెప్పబడుటచే సామంతప్రభువులు గావలసి వచ్చినది.

## నిరాధారము

ఆకాలపుకాలము ఎంతో జాగ్రత్తగా పరిశోధించగా నాకు విజయనగర సామ్రాజ్యముతో హోయసలులకు కలుపుటకుకొంచెమైనను ఆధారమా లేదని నమ్మకము కలిగినది. భాషాసంబంధమైనట్టియు, సాంఘికమైనట్టియు పౌలికలు పట్టి చేసిన వాదనలుకూడ చాల బాహ్యతాహీనములును, విచిత్రములుగను నున్నవి. హోయసల సిద్ధాంతకారులు ఖండితమైన, గమనించదగిన సాక్ష్యములు అని లేనిని చూపిరో అది ప్రతిలోక ముక్క యీ సామాన్యమైనదిగ కనగొనబడినది. అప్రతిలోక ముక్కయు, కాకతీయచారిత్రకు చెల్లగలదు. ఈవిషయములో శాసనములను జాగ్రత్తగా పరిశీలించినచో సత్యమగ పట్టుబడగలదు.

ఆంధ్రపత్రిక వారు ఈవిషయమున పరిశోధనమార్గములో ప్రయత్నించలేదు. వ్యతిరేకాధారములనుండి (లేదుఅని చెప్పవలె) ఒక సామాన్య సూత్రమును అల్లుటకు వారిపత్రిక ఈ ప్రయత్నమందు కనబడుచున్నది. డాక్టర్ వెంకటరమణయ్యగారివంటి ఆధునిక చరిత్రకారుల యభిప్రాయమును వెంటనే చెప్పక వదలివేసినచో వారికి అన్నివిధముల అపకారముగనుండెడిది. హోయసలసిద్ధాంతముతో చారిత్రిక సత్యమేదియు లేకుండినచో దానిని ఖండించుట న్యాయమైనపనియే. ఈవిషయములో డాక్టర్ వెంకటరమణయ్యగారి ప్రయత్నములు చాల సాహసములే. నాకు తెలిసినంతవరకు హోయసలసిద్ధాంతి ఎవడుగాని, తుదకు డాక్టర్ సాలెటోరుగారుకూడ (వారే భక్షకులు వారిలో అందరికంటె క్రొత్తవారు) వెంకటరమణయ్యగారి ఆక్షేపణలకు జవాబు చెప్పగల్గి యుండలేదు. నిజముగా డాక్టర్ వెంకటరమణయ్యగారు హోయసలసిద్ధాంతము పంపూర్ణముగా ఖండించివేసినారు. ఇక మీదట చారిత్రిక సత్యమును ప్రేమించు వారెవరుకాని డాక్టర్ వెంకటరమణయ్యగారి వివరములైన ప్రశ్నలకు తగినసమాధానము చెప్పుటకు ముందు ఆసిద్ధాంతమును సమర్థించజాలరు. ఇంతటితో ఈచారిత్రికుడు తృప్తిపడియుండినచో చాల బాగుండెడిది. వారు చేసిన సిద్ధాంతము హోయసలవాదుల విచారకరమైన ఊహా అవలెనే సందేహించదగినదిగ నున్నది. పౌలికలనుండి చేయువాదములు సరిగా చెల్లవలసినచో సంపూర్ణము గాను, అతివ్యాప్తి లేనివిగాను నుండవలెను. విజయనగర సామ్రాజ్య యంత్రము కాకతీయ సామ్రాజ్యమును పోలియుండెనని ఋజువుచేయ వీలైననో, దీనిచే నిరూపించబడునది ఎక్కువఏమియు నుండజాలదు. ఏలననగా, కాకతీయ, విజయనగర సామ్రాజ్యములు రెండుగూడ ఏకాభిప్రాయ పరిస్థితులచే ప్రేరితము లైనవే. ఈ అభిప్రాయముల ముద్ర ఇతరహిందూ సామ్రాజ్యములు లేక మధ్యకాలపు సామ్రాజ్యముల నేకములపైనున్నది. డాక్టర్ వెంకటరమణయ్యగారిచ్చిన వంశానుక్రమవిశేషములు చాల ఆకర్షణీయములు. కాని అవి అఖండ సిద్ధాంతములుకావు. వాటివలన తెలియునదంతయు తెలుగు సిద్ధాంతము బహుశా ఎక్కువ సత్యముగ నుండవచ్చుననియే.

ఇపుడు మనవద్దనున్న ఆధారము లన్నియు తెలుగు సిద్ధాంతమే చాలమట్టుకు నిజముగ నుండవచ్చునని నొక్కి చెప్పుటకు నేను వినుదీయను. కాని మొండిగా ఎవరైన చెప్పినచో నేను చారిత్రికునియొక్క విధి నతిక్రమించినవాడనగుచున్నాను. మనకు తెలిసి యున్న ఆధారములు ఒకదానికొకటి సంబంధము లేని ముక్కలుగనున్నవి. వాటి నొకదాని కొకటి సంబంధింప జేయవలసి యున్నది. ఇందుకు ఇతరత్ర నమ్మకమైన విధమున నుపయోగించు శాసనములు ప్రస్తుత విషయములో ఉపయోగించకున్నవి. ౧౪ శతాబ్దిలో రెండవపదకము నకు సంబంధించిన గోజ్జలవీడు శాసనము బుక్కరాయలవారిని నెల్లూరుజిల్లాలోని ఉదయగిరిగవర్నరుగా పేర్కొనుచున్నది. ఈబుక్కరాయడు మొదటిసంగముని తండ్రిగా నుండవలెను. తర్వాత సుమారు క్రీ-శ-౧౩౨౦ వ ఏట సంగముని గూర్చిన ఆధారము ఆతనికిని ఉదయగిరి గవర్నరు ఉద్యోగమునకు సంబంధమును కల్పించుచున్నది. ఆరోజులలో ములికినాడు, రేనాడు, గుత్తిసీమ, ఉదయగిరిసీమ, పొత్తపిసీమ, అని అనబడుచు నేడ బళ్లారి, కడప, నెల్లూరు, జిల్లాలు గాను న్న ప్రదేశము క్రీ శ- ౧౩౨౩ వరకు కాకతీయులక్రింద నుండెనని మన మెఱుగుదుము. కంపిల్లి రాజు హోయసల బిల్లాలపై దండయాత్ర వెడలినపుడు వారి వెంటనుండిన వారి అల్లుడగు సంగమునిగూర్చి మనము వినియున్నాము. ౧౩౨౭ సం॥ లో కాంపిల్లియు ఆనెగొందియు లొంగిపోయెను. ౧౩౨౩ లో కాకతీయ చక్రవర్తియగు ప్రతాపరుద్రుని పైదుచేసి ఢిల్లీకి గొనిపోవుటతో కాకతీయ సామ్రాజ్యముపోయెను. కాని హిందువుల ప్రతిఘటన ఇకను ఆగియుండెను. సోదరుల బిడ్డలగు సోమదేవుడును రాఘవుడును మహాబలముతో పోరాడి ముసల్మానులను వెనకకు తరిమివేసిరి. వారలు "కంపిల్లి రణరంగాధీశ్వర" అను పదమందును, "ఆనెగొంది సంగ్రామాధీశ్వర" అను పదమందును కంపిల్లికి ప్రభువుగా నుంచబడిన ముసల్మాను గవర్నరు యొక్క సేనలను అణచినట్లు చెప్పుచున్నారు. తుదకు సోమదేవుడు కళ్యాణిని పట్టుకొని సార్వభౌముడనిన ప్రకటించగలెను. సోదరులగు సోమదేవుడును రాఘవుడును ఆనెగొందికి కంపిల్లి రాజవంశము తో సంబంధము గలవారనునది స్పష్టము. వారు సహాయము చేయుటకు చాల ఆలస్యముగవచ్చిరి. ఈలోగా సంగముడు శత్రువులచే ఆరాని ఆనెగొంది దుర్గములో చేరి, గోరిల్లా పోరాటములతో ఇస్లాంబలమునంతయు ఎదిరించెను. ఆతని కుమారులు హరిహరరాయ, బుక్కరాయలు విజయనగర సామ్రాజ్యస్థాపకులు.

ఇవికాశ్వత సత్యములుగావు. తాత్కాలిక సూచనలు. ఒకటిమాత్రము నిజముగ కనబడుచున్నది. నేడు దత్తమండలములని వర్ణించబడుచున్న ప్రదేశములు నిస్సంశయముగ విజయనగర సామ్రాజ్య జన్మస్థానము. వంశానుచరితము తీసత్యముకు సమర్థించుచున్నది. కాని, నిరాకరించ వీలుగాని స్పష్టములైన నిర్ణయములను చెప్పవలసినచో, క్రీ. శ. ౧౩౨౩ కును ౧౩౩౬ కును మధ్య దక్షిణ హిందూదేశ చరిత్ర కాలమునుగూర్చి సంపూర్ణముగ పరిశోధనచేయవలెను. ఈ కాలమును గురించియే మనకేమియు తెలియదు. రాయచూరు ప్రాంతమందు, ముఖ్యముగా జాగ్రత్తగా పరిశీలించి శాసన సంబంధములైనట్టియు, నిర్మాణసంబంధములైనట్టియు విశేషములను త్రవ్వి తీయవలెను.

# నాట్యకళ ప్రోత్సహించుట అవమానకరమా?

(మొదటిపేజీ తరువాయి)

మరియెందేనియు లేదు. వారొక నాటకము ప్రదర్శించుదామన్న ఒక్కమందిరమైన, లేదుగదా! అందుకనే మొన్న పరిషత్తుకూడ చెట్టుక్రింద వేయబడిన పందిరిలో జరుపబడినది. ఆంధ్రులకు సంస్థానములున్నవి. జాగీరులున్నవి, ముక్తాలున్నవి, భూములున్నవి, ధనమున్నది, వ్యాపారమున్నది, సంఖ్యాబలమున్నది, స్థానబలమున్నది, ఒక్క నాటకమందిరము కట్టించగల శక్తి లేదా?

ఒక్క నాటకప్రదర్శనము కొరకే గాదు—ఏదైన సమావేశమునకు గాని, సభకుగాను అంధ్రులెంతకష్టపడవలసివచ్చుచున్నదో మీకు తెలియదా? శ్రీమంతులు సద్వినియోగములలో నిది

ను. ప్రమాణీకరించ దగిన ప్రత్యక్షాధారములు లేనపుడు మనము చెప్పుమాటలు అంత్యనిర్ణయములుగ నుండజాలవు. అట్లుండుటయే ఉత్తమము. స్థిరనిర్ణయములను చేయుటకు సమయము రాలేదని నాయభిప్రాయము. కాబట్టి విజయనగర సామ్రాజ్యోదయమును గూర్చిన సమస్యను ఇంకను అనిర్ణీతముగా వదలి వేయుచున్నాను.

యొకటిరెండు కొలదికాలములో నొకవేళ అంధ్రులకుప్రసాదింపగలరనుఆశ నాకు దీర్ఘముగా నున్నది. ప్రయత్నము చేసి చూచిన ఫలించకపోదు. ఈ నాట్యకళాపరిషత్తు ఏటేట జరుపవలెనన్న ఒక్కటే పాటుపడిన చాలదు. ఈసంవత్సర ఫలితములే ముందుకుగూడ గలుగగలవు అందుచేత కేంద్రసంఘము నొకదానిని స్థాపించి దానికి రాష్ట్రములోని నాటక సమాజములన్నింటిని చేదోడుగా జతజేసి, నటకులకు, నాటక గ్రంథకర్తలకు ప్రోత్సాహమచ్చి క్రొత్త నాటకములను వ్రాయించి ప్రదర్శింపజేసి ఆంధ్రనాటక రంగస్థలమును రాష్ట్రములో ఉచ్చదశకు తెచ్చుటకు ప్రయత్నము చేయవలెను. ఇట్టి సంఘము నేర్పరచుటకు ఒకసమావేశమును గావించుటకు నిర్ణయించినాము. అవాడే మొదటి పరిషత్తులో ఉత్తమ నటకులుగా పరిగణింపబడినవారు బహూకరింపబడుదురు. తేదీ వారము కాలము పత్రికాముఖమున అహ్వానముద్వారా తెలియపడుపగలదు. దానికైనను మీరందరు తప్పక దయచేయుడని ప్రార్థన. కళాభివృద్ధికై పాటుబడువారిని కటాక్షించవలెను.

# యూరపుకు నెహ్రూగారి ప్రయాణము

అలహాబాదు: మార్చి ౧౨ పండిత జవాహర్లాలు నెహ్రూగారు విశ్రాంతి గైకొనుటకు జూను మొదటివారములో యింగ్లాండు వెళ్లదలచినను యింక వరకుమాత్రము కార్యప్రణాళికమాత్రం తయారు చేయబడినటుల లేదు. ఆ మాసములో నరకు వీరుతమ కూతురగు ఇందిరానెహ్రూతో యూరపు సంచారము మొనర్చెదరు. వీరు ౧౫ జూన్ వరకు లండన్‌లో చేర నిశ్చయించిరి. ఇందిరానెహ్రూగారికి సెలవు లావేదీవర కారంభమగును. తిరిగి సెప్టెంబరు మాసారంభమున నెహ్రూగారు స్వదేశమునకు రాదలచినటుల గలదు.

# మద్యపాన నిషేధము

## జగత్యాల

ఉదయము నగరసంకీర్తనము జరిగినది. మధ్యాహ్నము యువకులుకొందరు హరిజనవాడకేగి అచ్చటివారికి పారిశుద్ధ్యముగురించి చక్కగాబోధించిరి. సాయంకాలము ౪ గంటలకు గ్రామవాసులు గొప్ప యూరేగింపుతో గ్రామవీధుల సంచరించుచు బ్యాండుమేళములతో మద్యనిషేధపత్రములచేత ధరించి ప్రబోధవాక్యముల నుచ్చరించుచు జాతీయగీతముల పాడుచు కట్టుబంగ్లాకుచేరిరి. అచ్చట ప్రభుత్వోద్యోగులు, న్యాయవాదులు, షాహుకారులు గుమిగూడియుండిరి. దువ్వం నాలుక్దారుగారి అధ్యక్షతక్రింద సభజరిగినది. మద్యపాన అరిష్టములు ప్రజలకు బోధింపబడినవి, ప్రజలుత్యజించుటకు నిశ్చయించిరి.

## మహబూబు నగరము

మద్యపాన నిషేధప్రచారము ౨మార్చి తేదిన మిక్కిలి విజయవంతముగా జరిగినది. అభివృద్ధిపక్ష సభ్యులనేకులుదయమునవే ప్రబోధగీతములపాడుచు నగరసంకీర్తన మొనరించిరి. శ్రీ వడ్డి వెంకటరెడ్డి, వెంకట చలపతిరావుగారల నాయకత్వమున మధ్యాహ్నము వేలకొలదిప్రజలు నగరవీధులనుండి యూరేగింపుతో వెడలి, యువకులుకొందరు కల్లు అంగడులవద్ద కల్లు త్రాగబోవవారల వలదని ప్రార్థించి దీనివలన కలుగు అరిష్టములు ప్రజలకుబోధించిరి. మరికొందరు యువకులు హరిజనవాడలకేగి వారిఅభ్యుదయమున కవసరమగు విషయములను వారలకు చక్కగాబోధించి కల్లుసారాయి త్రాగుట మానుటకు ప్రార్థించిరి.

జహీరంగపట్టయందు మద్యపానము వలన కలుగుచున్న అనర్థములు విపులముగా పలువురు విశదపరచిరి. ప్రజలు మానుకొందుమని వాగ్దానమొనరించిరి.

# నోటీసు

యిందుమూలముగా తెలియజేయునది యేమనగా మధిరతాలూకా, మడుపల్లె శివారు అల్లీనగరం గ్రామములో, నా స్వాధీనహక్కు భుక్తములోవున్న సర్వే నెం. ( ౯౬ ) గరుజుఖింజుమలెయ. (౭—౨౧) శిస్తు (౧౨॥౦) గల మెరకభూమిని పెండ్యాల వెంకటేశ్వరరావు కొంతమంది దుర్మార్గుల దుస్సలహాలచే సదరుభూమిని అన్యాక్రాంతములు చేయుటకు ప్రయత్నించుచున్నట్లు తెలియబడుచున్నది. అతనికి సదరు భూమితో యెట్టిదైన సంబంధము వుండిలేదు. ఒకవేళ అన్యాక్రాంతములు జరుగునెడల అవి చెల్లబడవని తెలిసికొనగలరు.

ఇట్లు
పెండ్యాల సుబ్బమ్మ
మధిర.

## పత్రిఘుండా

(౨వ పేజీ తరువాయి)

ప్పినప్పుడు మాచి ఏమిటిది? దాని రిపోర్టు ఎందుకు పంపలేదు? నా ఆజ్ఞలేకుండ ఎందుకువాటాపు? ఇపుడే పరికి పొరయ్యి, పెట్టి అన్నాడు. గుమాస్తా తాగివున్నాడు. ఈమత్తులో వుంటాడు గమనించుచున్నాను. కాని ఏమవుతుంది? మూడురుబుల్సు జురుమానా వేశాడు,

లాసిలీ క్షణంసేపు నిశ్శబ్దంగా వుకొంటాడు నిలబడ్డాడు. తరువాత ఇంకొంచెంసేపు మాట్లాడితే వానిని మరమ్మతుచేయక విడిచే వాడినికాను అన్నాడు.

తమ్ముడూ! నీవల్లు చాలా తలకెక్కింది సంగతది కాదోయి. నేను సత్యం చెబుతున్నాను. నన్నామాటే పట్టుకుంది. అహా! చూడు ఎప్పుడన్నా ఒకసారి వానిముక్కు నేలబెట్టి రాయక విడువను. పెద్దాఫీసరుతో రిపోర్టుచేస్తాను. అల్లానేర పోర్టుచేశాను లాసిలీ

ఒకసారి పెద్దాఫీసరొకస్వయంగా లైనుపరీక్ష చెయ్యడానికి బయలుదేరాడు. వెంట పీటరుబర్గునుంచి సుప్రసిద్ధ రాజనీతిజ్ఞుడు ఏదోవిషయాన్ని పరీక్షించటానికై బయలుదేరాడట. ఇంకేముంది, రాళ్లు ఇటుకలు చక్కగాపేర్చి సున్నం కొట్టించారు పట్టాలు సరిచేశారు. కర్రస్లీపర్లు, చెడిపోయినలైట్లు బాగుచేశారు. స్తంభాలకు రంగుకొట్టించారు. గేటుచుట్టూ యిసుకపోయించారు. ఇంతెందుకు ఆరాజనీతిజ్ఞుని స్వాగతానికి కావలసిన వస్తు సామగ్రి అంతా తయారుచేయబడ్డది. పొరుగునవున్న ముసలి గేటువానిభార్యకూడా తనభర్తను ఉత్సాహపరచి గేటంతా శుభ్రపరచుకున్నది. సిమియనుకూడా సుమారు వారమురోజులనుంచే ఈపనులు చేస్తున్నాడు. గేటును శుభ్రపరచాడు తనసామానంతా మరమ్మతుచేసి హాజరుగా వుంచాడు. తన ఇత్తడి బొత్తములు చక్కగా మెరిసేలాగు చేసుకున్నాడు. లాసిలీకూడా క్రమపడి గేటంతా శుభ్రపరచాడు. ఆఖరుకు ఆఫీసరు ట్రాలీమీద గడగడమని శబ్దంచేసుకుంటూ పదిహేను మైళ్ల దూరాన్నుంచి బయలుదేరాడు. తలవనితలంపుగా ట్రాలీసిమియను గేటువద్ద ఆగింది సిమియను గేటులోపలనుంచి తొందరగా బయటకువచ్చి ఆఫీసరుకు సలాము చేశాడు. గేటు పరిశుభ్రతనుచూచి ఆఫీసరు చాలా సంతోషించాడు. సిమియనుని కొన్ని ప్రశ్నలు వేశాడు. అన్నిటికిసిమియను చక్కని సమాధానాలు ఇచ్చాడు. నీవిక్కడెంతకాలాన్నుంచి వుంటున్నావన్నాడు ఆఫీసరు. "రెండు మాసాలనుంచి వుంటున్నానుసార్" అన్నాడు సిమియను.

ఆఫీసరు:— మంచిది ౧౬౪వ నెంబరు గేటులో ఎవరుంటున్నారు?

తనతోవున్న గుమాస్తా లాసిలీ స్పిరిడాఫ్ అన్నాడు.

ఆఫీసరు:— తలవూపి లాసిలీ స్పిరిడాఫ్! ......లాసిలీ...... స్పి ...రి... డా ...ఫ్! ఎవరు? వెనుకటి తనఖీలో నీవు రిపోర్టుచేసిన వాడా?

అవునండి. అతడే .. అన్నాడు గుమస్తా,

ఆఫీసరు.— మంచిది. అయితే వానితనఖీ చేస్తాముపద!

ట్రాలీవాళ్లు ట్రాలీని తోశారు. ట్రాలీ ముందుకు పరుగెత్తింది. సిమియను వాన్ని తదేక దృష్టితోచూస్తూ నిలబడి ఈవేళ లాసిలీకి, ఈయనకు ఏదో రసాభా అవుతుంది అనుకుంటున్నాడు.

సిమియను రెండుగంటలతర్వాత తన నియమానుసారంగా పట్టాలను చూచుకోటానికి బయలుదేరాడు. అప్పుడతనికి కొంతదూరాన్నుంచి ఒకవ్యక్తి వస్తున్నట్లు కనుపించింది. అవ్యక్తి తలమీద ఏదో తెల్లగా కనుపిస్తున్నది సిమియను మరింత దృష్టిసారించి చూడబోగాడు. అవ్యక్తి లాసిలీఅని తెలిసింది. చేతిలో కర్ర, బుజాన్నిమూట, తలకు ఒక అంగవస్త్రం చుట్టుకొని వున్నాడు.

సిమియను కేకవేసి ఒరేయి! ఎక్కడకు పోతున్నావురా? అన్నాడు.

లాసిలీ దగ్గరకు వచ్చాడు. ముఖాన్ని రక్తపు చుక్కలేదు. వాలికండ్లు భవిష్యత్తును తెలియజేస్తున్నాయి. గొంతు బొంగురుపోయింది. "మాస్కోపట్టణానికి పోతున్నాను. హెడ్డాఫీసుకు" అన్నాడు.

అక్కడకు ఎందుకుపోతావ్? ఏదో రిపోర్టు చేయడానికి వెడుతున్నావు. నాకుతెలుసు. లాసిలీ స్పిరిడాఫ్! పోనివ్వు మరచిపో. దీనివల్ల ఎంతమాత్రం లాభంలేదు.

ఆ! ఎల్లా మరవను? మరచిపోయే సంగతా ఇది! రక్తంకారేటంత దెబ్బకొట్టాడు ముఖంమీద. నాజీవితములో మరచిపోతానా! నేనీ సంగతిని సాధారణంగా విడువను.

సిమియను లాసిలీ చెయ్యిపట్టుకొని నామాటవిందూ, వృథాగా జగడం పెంచవద్దు. ప్రయోజనం లేదు సుమా అని ఊరడించబోయాడు.

అవును. అవన్నీ ఫలితమేమిటో నాకు తెలుసును. కాని యేంచెయ్యను? అదృష్టం యెట్లా వుంటే అట్లాఅవుతుందని చెబుతున్నావు. నిజమే కాని సాహసంకొరకు నేను దెబ్బలాడుతున్నాను. తరువాత ఏమిజరుగుతుందో చూస్తాను.

సరే. ఆ తలుపంగతేమిటో కొస్త చెప్పుమా.

అన్నీ సంగతేమీలేదు అతడు వస్తువులను పరీక్షించాడు. ట్రాలీదిగి గేటులోనికూడా వచ్చాడు నీవు క్రమంగా సంచరిస్తాడని నేను ముందే యెరుగుదును. అందుచేత నే వస్తువులన్నీ సరసగా పెట్టి వుంచాను. వాడు తిరిగి వెళ్లబోతుండగా నేనేదో ప్రార్థించబోయాను. ఇంతే దీనిమీద మండిపోయాడు. దీనిని తనఖీచేయడానికై సర్కారుఉద్యోగులు పెద్దవారిందరో వస్తువుంటారు. నీవు కూరగాయలు పెంచుకుంటూ కూర్చుంటావా? నీ గోబీ సంగతి నాకు తెలుసు. అన్నాడు జోరుగా. దీనికి జవాబువస్తుంది నానోటిమ్మట.... బస్. వచ్చిపోయాడు. మొఖంమీద దెబ్బకొట్టాడు. నేనల్లానే నిలబడిపోయాను. ఏమీ అనలేదు. ఇక అంతేనా? వాడల్లా వెళ్లిపోయాడు. నేను కూడా మొఖంకడుగుకొని ఇల్లా వస్తున్నాను.

గేటును ఏమిచేసి వస్తున్నావు?

గేటులో నాభార్య వుండనేవుందిగా. ఇక పట్టా భయమేమీలేదు నాకు.

లాసిలీ వెడుతూ ఇవానష్! వెడుతున్నాను. ఆ ఆఫీసులో నామొర ఆలకిస్తారా సరే లేకపోతే చూస్తాము సెలవుఅన్నాడు.

అయితే ఇంతదూరము నడిచేపోతావా?

లేదు. ముందు స్టేషనులో ఏదైనా సామాను బండి దొరకుతే దానిమీద పోతాను. రేపటికి మాస్కో చేరుకోగలను.

ఇద్దరూ ఒకరినొకరు సలాములు చేసుకొని సెలవుపొందారు. లాసిలీ కొన్ని దినాలవరకూ తిరిగి రాలేదు. తనభార్య రాత్రి పగలు కష్టపడి పనిఅంతా చేసుకుంటుంది. మొత్తానికి భర్తలేనిలోటు తీరుస్తుంది. పాప మామెనుంది నిద్ర దూరమయిపోయింది. రేయింబవలు భర్తరాకకై తలచివుండడమే ఆమెకు నిత్యకృత్యమైపోయింది. తనభర వెళ్లిన మూడవదినం ఒక రాజనీతిజ్ఞుడు లైనుపరీక్ష చెయ్యడానికై బయలుదేరాడు తనకొక ప్రత్యేకబండి. దానిలో ఒక ఇంజను, ఒకసామానుపెట్టి, రెండు మొదటితరగతిపెట్టెలుతప్ప మరేమీలేవు. కాని లాసిలీ సంగతేమీ తెలీదు. నాలుగవదినం సిమియను ఆమెను కలసుకున్నాడు. పాపమామె ఏడుస్తూవుంది. ముఖం వాడిపోయింది. కండ్లు ఎఱ్ఱబారిపోయాయి. నీభర్త వచ్చాడా! అన్నాడు సిమియను.

లేదు.అని చేయిసైగచేసింది.ఆమె తిరిగి తన పనిలో లీనమయింది. నోటినుండి ఒక్కమాటకూడా రాలేదు.

సిమియను చిన్నతనంలో ఒకవిద్య నేర్చుకున్నాడు. అది వెదురుముక్కతో చిన్నచిన్న పిల్లనగ్రోవులు చేయుడం. వెదురుకర్రను లోపలమంచి కాల్చి శుభ్రపరచి, దానికి రంధ్రములు కూడాచేసి నోటివద్ద చిన్నముక్కనమర్చి ఏధ్వని కావాలంటే అధ్వనివచ్చేటట్లుగా చేయగలడు. తనకు తీరికగావున్నప్పుడల్లా ఈ పిల్లనగ్రోవులు తయారుచేసి సామానుబండిలోవుండు కూలీలచేత పట్టణానికిపంపి అమ్మిస్తుండేవాడు, ఒక్కొక్క పిల్లనగ్రోవికి రెండు కోపెక్కులు (రష్యా నాణెము)దొరుకుతుండేవి.

ఒకదినం భార్యతో ఆరుగంటలకు గేటులో హాజరుగావుండమని చెప్పి సిమియను వెదురుకర్రలకు అడవికి పోయాడు. తన లైను హద్దువరకూపోయాడు. అక్కడ లైను మలుపుతిరిగి పర్వతములక్రిందుగా అడవిమధ్యగా పోయింది. అక్కడకు సుమారొక అరమైలుదూరంలో ఒక చెరువుంది. ఆచెరువు గట్టుమీద మంచి వెదురుపొదలున్నాయి. వీటితోనే పిల్లనగ్రోవులు చేస్తుంటాడు. సిమియను అక్కడకు వెళ్లి తాను మోయగలిగినన్ని కొట్టి కట్టకట్టి నెత్తినపెట్టుకుని తిరిగి ముఖంపట్టాడు సాయంత్రం అవుతూవుంది. సూర్యుడప్పుడే అస్తమిస్తున్నాడు. అడవంతా నిశబ్దంగావుంది. గూళ్లకు మళ్లినపక్షుల కలకలరావములు తప్ప మరేమీ వినబడడంలేదు. ఇల్లాంటి సమయంలో ఇనుముమీద ఇనుముపెట్టి కొట్టినట్లు ఖంగ్ మను శబ్దము అతనికి ఆకాటుగా వినవచ్చింది. అతడు నడకజోరు చేశాడు. ఈసమీపాన్నెక్కడా పట్టాలు కూడా బాగుచేయడంలేదు. అసలు సంగతేమా అని ఆలోచిస్తున్నాడు సిమియను తొందరగా అడవిదాటి లైనుదరికి చేరుకున్నాడు. క్రమంగా హెచ్చిపోతున్న లైనువంక తేరి పారచూశాడు. ఎవరో ఒకమనిషి, పట్టాలమీదకూర్చొని ఏదో చేస్తున్నట్లు కనుపించింది. సిమియను త్వరత్వరగా ఆమనిషివద్దకు వెళ్లసాగాడు. దొంగయెవడో పట్టాలనుండి మేకులు లాగుతున్నట్లు అనుమానపడ్డాడు. ఇంతలో రెండవ మనిషికూడా లేచి నిలబడ్డాడు. అతని చేతిలో ఒకసారె, మరొకపనిముట్టూ వుంది. అతడు పట్టాలను పూర్తిగా వేరుచేసివేశాడు. బండి రావడంతోనే జారి పడిపోయేటట్లు చేసేశాడు. ఇదిచూచేసరికి సిమియనుకి కండ్లు చీకట్లుకమ్మేశాయి. కేకలేద్దామనుకున్నాడు. కాని నోటమాటరాలేదు. ఆరెండవమనిషి లాసిలీ. సిమియను ఎట్లాగో దగ్గరకువచ్చేసరికి లాసిలీ పారిపొయ్యి కొని కట్టకట్ట రెండవప్రక్కకు దిగిపోయాడు.

ఒరే లాసిలీ! ఇల్లారా, సీపార వాకియ్యి, నంయిద్దరంకలసి ఈపట్టాలు బాగుచేద్దాము రా. యెవరికీ తెలియదులే. భయపడకు ఈ పాపం నీనెత్తిపెట్టుకోవద్దు సుమా, అని కేక వేశాడు సిమియను.

లాసిలీ [illegible]

సిమియను పూడిపోయిన పట్టాలవద్దకువచ్చి నెత్తిమీపు క్రిందపడేశాడు బండివచ్చే సమయంకూడా అయ్యింది. సామానుబండికూడా కాదు. జనంబండి సిమియనువద్ద బడినాపే పరికరాలేవీ కడకుచేతిలో వస్తు దానకూడా లేదు. ఖాళీచేతులతో పట్టాలు బాగుచెయ్యలేడు. పాపమతడేమి చెయ్యగలడు? గేటువద్దకుపరుగెత్తి కమ్మరిని తీసుకురావడం చాలా అవసరం. భగవంతుడు నీకు సహాయ్యం చేస్తాడులే అని మనస్సుకు ధైర్యం చెప్పుకుంటున్నాడు.

సిమియను గేటువైపు పరుగెత్తుతున్నాడు. వూపిరాడుటలేదు చాలాదూరం పరుగెత్తాడు. గేటు రెండువందల అడుగులదూరం వుండగా అవిని అవతలవున్న బట్టమిల్లు సాయంత్రం ఆరుగంటలను తెలిపే కూతవేసింది. ఇక రెండునిమిషాల్లో ఏడవనెంబరుబండి వస్తుంది ఓ ఈశ్వరా! అనహాయుల్ని రక్షించుమని పెద్ద కేకవేశాడు. ఇంకా ఇల్లా తలుస్తున్నాడు—ఇంజను పూడిపోయిన పట్టాలవద్దకు వచ్చిందా దాని తాకుడుకు పట్టాలు మరింత దూరమైపోతాయి. కర్రస్లీపర్లు చూర్ణమైపోతాయి. ముందు మలుపుకూడావుంది. లైను సుమారు భూమికి డెబ్బది అడుగులయెత్తున్నది. ఇంజను తల కిందులుగా పడిపోగలదు మూడవతరగతి పెట్టెల్లో పిల్లలు పెద్దలు యెందరో క్రిక్కిరిసి వుంటారు. పాపం ముందింత భయంకరమైన ఆపదవస్తుందని వారు కలనైనాఅనుకొని వుండరు. గేటువరకు వెళ్లి తిరిగిరావడం అసంభవం. ఓప్రభూ! నీ వేదిక్కు.

సిమియను గేటువద్దకు వెళ్ళకుండానే వెనక్కుతిరిగాడు. చాలా వేగంగా తిరిగాడు. పడుతూలేస్తూ పరుగెడుతున్నాడు, కండ్లు మూసుకుని పరుగెడుతున్నాడా అనిపిస్తుంది. అతడు ఆలోచించకుండానే తాను పడేసిన మోపులోనుంచి ఒక కట్టెనులాగి బండికెదురుగా మరింత ముందుకు పరుగెత్తాడు. బండివస్తుందని తెలుసుకున్నాడు. రెండవకూతకూడా వినవచ్చింది. బండి అదురుతూ పట్టాలు కదలడంకూడా చూచేసరికి తన్న పాదాలు పైవైనే ఎగిరిపోయాయి. ఇక ముందుకు వెళ్లలేకపోయాడు పూడిపోయిన పట్టాలకు సుమారు ఆరువందల అడుగులదూరంలో నిలబడిపోయాడు,

అతనికి తలవని తలంపుగా ఒకవుపాయం తట్టింది. తనటోపీతీసి దానిలోనుంచి ఒక చేతిరుమాలుతీశాడు. మొలనున్న కత్తిదీశాడు. చేతిమీద చెయ్యివేసుకుని—ఓ ఈశ్వరా! నీదయే నాకు శరణ్యంఅన్నాడు.

సిమియను వెంటనే తన యెడమభుజము లో పొడుచుకొని తన్నుకున్న రక్తధారను బయలుదేరదీశాడు ఆ చేతిరుమాలును ఆ వేడిరక్తములో చక్కగాతడిపాడు. దానిని కర్రకుకట్టి ఎగరవేశాడు. రెండుసెకన్లలో ఎఱ్ఱఝండాను తయ్యారుచేశాడు.

అఝండాను వూపుతున్నాడు. బండి కనుపించింది. డ్రైవరుచూడలేదు. బండి దగ్గరకు వచ్చింది. ఆరువందల అడుగులదూరంలో బండినాపుట సామాన్యంకాదు.

ఒకప్రక్క సిమియనకి భుజంనుండి రక్తం ప్రవహిస్తుంది. రెండవచేతితో గాయమును నొక్కిపట్టాడు; కాని రక్తధార కట్టుబడలేదు. అతని భుజంమీద గాయం లోతయ్యింది. తలతిరగసాగింది, అతడెవైపుచూచినా అంధకారమే క్రమ్ముకపోయింది. తనచెవులలో గంటమ్రోతవలె ధ్వనిపుట్టింది, బండిని చూడలేకపోయాడు. దానిధ్వనికూడా వినలేకపోయాడు. నేనెల్లా నిలవగలనన్న ధైర్యమే అతనిమనస్సులోని అదిపోయింది. నన్ను చూడకుండా బండిముందుకు రాకూడదు బండి పడకూడదు.

అతనికండ్లయెదుట చీకటి వ్యాపించింది తన దృష్టిలో సర్వశూన్యం అయిపోయింది. ఓ ఈశ్వరా! సహాయ్యంకమ్ము...ఇవే సిమియను అంతిమమాటలు. ఝండా చేతినుండి విడివడిపోయింది, కాని అరక్తఝండా భూమిమీద పడలేదు, రెండవచేయి దానినిపట్టుకొని మరింత పైకెత్తింది. ఇంజనువాడిదిచూచి బండాపాడు.

జనులు పెట్టెల్లోనుంచి గుంపులు గుంపులుగాదిగివచ్చి సిమియను చుట్టూ పెద్దగుంపయ్యారు. ఆశ్చర్యంగా చూస్తున్నారు. పట్టాలవద్ద కాలిదారిలో ఎవరో రక్తంలో కడికిపడివున్నాడు. రెండవవాడు రక్తంలోతడిసిన గుడ్డపేలిక కర్ర పుకట్టుకొని నిలబడ్డాడు.

వాసిలీ ఒకసారి కండ్లుతెరచి అందర్ని తేరిపారచూచి తలవంచుకున్నాడు అతని అంతిమవాక్కులివి—నన్ను పట్టుకోండి. ఈపట్టాలను తొలగించినవాణ్ణి నేనే. న. ..న్ను......

(హిందీనుండి).

